MY CANDYMAN ADVENTURES



# పొరుగింటి నీచుడు





























# Kuch bhi karega for CANDYMAN?



## Help your Candyman friend find her candies.







**Just three steps for winning many exciting Candyman Prizes:**

- Help your Candyman friend find her Nakkhat Mango candies.
- Complete the slogan 'I like Candyman because...' in not more than 10 words.
- Complete all the details about yourself and send it by June 30, 2008 to:

**Indira Valson, Chandamama India Ltd., 6th floor, Block A, JVLPlaza, 626, Anna Salai, Teynampet, Chennai - 18.**

I like Candyman because ..........................................................

Name: .................................. ☐ Boy ☐ Girl Age: .......... Address: ..........................................

.......................................................................................... Ph. no.: ..........

School: .................................. Class: .......... E-mail ID: ..........................................

TERMS AND CONDITIONS

DRAFTFCB+ULKA 85004A



చందమామ సంపుటి: 60 జూన్ 2008 సంచిక:06

## ఈ నెల విశేషాలు



నీలాంజన చర్య (బే.క) ...19



తండ్రిని ఉప్పులాగా ప్రేమించిన యువరాణి ...35



నిగూఢ ప్రదేశంలో అద్భుత అన్వేషకుడు ...42



రామాయణం (సుందరకాండ - 1) ...57

## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

కార్యార్థి అయినవాడు నేల మీద పడుకున్నా, పరుపు మీద పడుకున్నా; కాయకసురులు తిన్నా, సన్నబియ్యం అన్నం తిన్నా; బొంత కట్టినా, పట్టు పీతాంబరాలు కట్టినా; దుఃఖం కలిగినా, సుఖం కలిగినా లక్ష్యపెట్టడు.





# భూగోళాన్ని చల్లబరుద్దాం!

వాతావరణ పరిరక్షణ గురించి మాట్లాడే ప్రతి ఒక్కరూ ఇటీవల భూగోళం వెచ్చబడడం గురించి ప్రస్తావిస్తున్నారు. ప్రకృతి వనరులను మితిమించి దురుపయోగం చేయడం వల్ల ఈ ముప్పు రోజు రోజుకూ పెరిగిపోతూ మానవజాతి మనుగడకే ప్రమాదం వాటిల్లే స్థితి ఏర్పడుతున్నది.

వాతావరణంలోని కొన్ని వాయువుల కారణంగా భూగోళం వెచ్చబడుతోంది. మనుషులు వదిలే కార్బన్ డైయాక్సైడ్, వాహనాలు వెలువరించే కార్బన్ మోనాక్సైడ్, ఫ్యాక్టరీల నుంచి వెలువడే మీథేన్, నైట్రస్ ఆక్సైడ్ మొదలైనవాయువులు భూమి ఉపరితలంలో దుప్పటిలా మందమైన పొరగా ఏర్పడి, వేడిని వెలుపలికి వెళ్ళనీయకుండా అడ్డుకోవడం వల్ల భూమి వెచ్చబడుతోందని విజ్ఞాన వేత్తలు చెబుతున్నారు.

ఇలా భూమి వెచ్చబడడం కారణంగా అంటార్కిటిక్ మంచుఖండం కరిగి సముద్రంలో విరుచుకు పడ్డట్టయితే సముద్రమట్టం పది మీటర్లు పెరిగి తీర భూములను ముంపుకు గురిచేయగలవని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. పర్యవసానంగా అపారమైన ప్రాణనష్టం, ఆస్తినష్టం వాటిల్లక తప్పదు. అందువల్ల వాతావరణ సమతౌల్యాన్ని కాపాడవలసిన అవసరం గురించి మన పత్రికలోనూ తరచూ చెబుతూనే ఉన్నాం.

ఈ సందర్భంగా మనం గుర్తుంచుకోవలసిన ముఖ్యమైన విషయం ఏమిటంటే-వాతావరణ సమతౌల్యాన్ని కాపాడ్డం కేవలం ప్రభుత్వాల, పాలకుల బాధ్యత మాత్రమే కాదు. అది భూమిపై పుట్టిన ప్రతి ఒక్కరి కర్తవ్యం. ''ప్రపంచాన్ని మార్చాలంటే మొదట మన చుట్టూ ఉన్న పరిసరాలను మార్చాలి!'' అన్న సూక్తి వ్యక్తుల కర్తవ్యాన్ని గుర్తుచేస్తోంది. ఈ విషయంలో చురుగ్గా పనిచేస్తున్న చెన్నైయ్‌లోని ఎక్స్‌నోరో అనే ఎన్‌జివో చెబుతున్నట్టు 'భూమిని చల్లబరచడానికి' మనవంతు ప్రయత్నాలు చేద్దాం. భూగోళాన్ని కాపాడుకుందాం!

సంపాదకుడు : **విశ్వం**







చందమామ

**Editor, Publisher :** B. Viswanatha Redd (Viswam)
**Chief Executive Officer :** L. Subramanyan
**Editorial Advisors :** Ruskin Bond, Manoj Das
**Consultant Editor :** K. Ramakrishnan
**Associate Editor :** AR. Balasubrahmanyam
**Artists:** KC. Sivasankaran (Sankar)
Gandhi Ayya, P. Mahesh
**Layout Design:** R. Sudha
**Assistants:** D. Revathy, B.A. Hemalata Malini
**Research :** R. Vasugi

**CIRCULATION TEAM :**
**Chennai : T N Ravi Shankar, *National Sales Manager***
91 99620 7014
ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales***
91 99625 67860
fazal.khan@chandamama.com
**Mumbai : Rajendra K Jadhav, *Asst. Manager - Circulation***
91 9271720669
**CHANDAMAMA INDIA LTD.,** B3, Luric Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MDC Andheri (East), Mumbai-400093
91 22 28312872 / 28311849
rajendra.jadhav@chandamama.com
**New Delhi : Sushil Sharma, *Circulation Manager-North***
91 98719 3067
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaght Place, New Delhi 10001
**Bangalore : P. Murali, *Asst. Circulation Manager-Karnataka***
91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 665 1000
murali.p@chandamama.com
**Kolkata : Ananth Prakash, *Circulation Manager-East***
91 98351 82202
ananth.prakash@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Online and Interactive :* Surajit Agarwal**
91 99620 70015
surajit.agarwal@chandamama.com
***Head Office :* CHANDAMAMA INDIA LTD.,**
JVL Plaza, Block-A, 6 Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. **180.00**
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ,
మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ
ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.

# పాఠకుల లేఖలు

**రూ. 250/- బహుమతి పొందిన లేఖ**

ఏప్రిల్ 'చందమామ' సంపాతి, ఆంజనేయ, అంగద, జాంబవంతుల ముఖచిత్రంతో అద్భుతంగా ఉంది.

'కథకు పట్టం' కథ ఆసక్తిగా చెప్పగలిగితే కథకు పట్టం కాదు, పట్టాభిషేకమే జరుగుతుందని నిరూపించింది. ఇహపోతే, 'బెత్తం స్వాములు' కథ పరిసరాల స్పృహతో ఉన్న మనిషికి భవిష్యత్తులో సంపూర్ణ విజయాలు లభిస్తాయని చాటిచెప్పింది. పాతికేళ్ళ నాటి కథ, ప్రాణం మీదికి వచ్చిన విద్య, మోసం దాగదు అన్న నీతిని ప్రబోధించింది. ఈ నెల విశ్వంగారి సంపాదకీయం హైలైట్ అని చెప్పవచ్చు. ఎందుకంటే విద్యార్థులకు గ్రేడ్లు ఇచ్చేటప్పుడు కేవలం మార్కులు కాక పరిపూర్ణ వ్యక్తిత్వం లోని ఇతర అంశాలను పరిగణనలోకి తీసుకోవాలని చెప్పడం నాకెంతో నచ్చింది. అంతేగాక, విద్యావిధానంలో మార్పురావాలని, జ్ఞానానికి ఉత్తమ విలువలు, ప్రవర్తన అవసరమన్న 'కలాంజీ' అమృత వాక్కులు సంపాదకీయానికి వన్నెలు దిద్దాయి. 'బాలల కథ' 'కవిత' శీర్షికలు ప్రవేశ పెడితే 'బాలల పత్రిక' అన్న భావన బాలలలో ఏర్పడుతుంది. ఆలోచించరూ!

వూకాటి శ్రీనివాసులు,
పొదలకూరు, నెల్లూరు జిల్లా - **524 345**

నా ఊహతెలిసినప్పటి నుంచి మా ఇంట్లో చందమామ కథలు చాలానే విన్నాను. చదివాను. నా విషయంలో కొంత కుటుంబంతో వచ్చిన విలువలు, కొంత నీతి కథల వల్లనూ మంచి అలవాట్లు అలవడ్డాయి. ప్రతి చిన్నారికీ చందమామ అందుబాటులో ఉండాలని ఆశిస్తున్నాను.

-కె. రామకృష్ణారెడ్డి, హైదరాబాదు



# లాభం-నష్టం

కామేశం మొక్కు తీర్చుకునేందుకు ఒక రోజు రామేశాన్ని తోడు తీసుకుని కాలినడకన చిన్నా పురం బయలుదేరాడు. దారిలో పెద్ద వానపడి ఇద్దరూ బాగా తడిసిపోయారు. వెంటనే కామేశా నికి జలుబు చేసి తుమ్ములు ప్రారంభమ య్యాయి. ''రోజూస్నానం చేశాక రెండు తులసా కులు తిను. జలుబన్నది రాదు. అందుకు నేనే నిదర్శనం,'' అన్నాడు రామేశం.

''తులసాకులు తిన్నా, జలుబురాక తప్పదు, నువ్వూరుకో,'' అన్నాడు కామేశం విసుగ్గా.

చిన్నాపురం చేరాక వైద్యుడి వద్దకు వెళ్ళారు. రామేశం ఆయనతో, ''రోజూ తులసాకులు తింటే జలుబు రాదన్నాను. నమ్మడు. జలు బంటూ వస్తే దానికి మందు లేదన్నాను. వినడు. నువ్వు చెబితే వింటాడేమో చూడు,'' అని కామేశం మీద ఫిర్యాదు చేశాడు.

వైద్యుడు అతణ్ణి గుర్రుగా చూసి, ''నా దగ్గరికి వచ్చేవాళ్ళలో సగం మంది జలుబు రోగులే. అది రాకుండా ఆపే చిట్కా ఉందనీ, వచ్చినా మందు అక్కరలేదనీ చెప్పడమంటే నేను వృత్తి మానుకుని పోవాలి,'' అంటూ కామేశా నికి మూడు రోజులకు సరిపడా మందిచ్చాడు.

రామేశాన్ని వైద్యుడు కూడా తప్పు పట్టి నందుకు మనసులో నవ్వుకున్న కామేశం ఆరోజుకు మందువేసుకుని, రామేశంతో కలిసి గుడికి బయలుదేరితే ఆయనకు మళ్ళీ మళ్ళీ తుమ్ములొచ్చాయి. ''నేను చెప్పానుకదా. మందులు వేసుకున్నా మూడు రోజులవరకు తగ్గదని. నా మాట విని రోజూ తులసాకులు తినడం ప్రారంభించు,'' అన్నాడు రామేశం.

''అబ్బా! తులసాకుల సొద వదలవుకదా!'' అని విసుక్కున్నాడు కామేశం. ఇద్దరూ గుడి మెట్లెక్కుతూంటే అక్కడ ఒకడు ఆగకుండా తుమ్ముతున్నాడు. రామేశం అతనికి తులసా కుల సలహా ఇవ్వడానికి వెళ్ళాడు. అంతలో అక్కడికి వచ్చిన ధనరాజు అనే వ్యక్తి కామేశానికి నమస్కరించి, ''శ్రీనివాసుడి గుడికి వచ్చే భక్తుడి నుంచి ఇరవై వరహాలు దానంగా పుచ్చుకుని

బాబి

వ్యాపారం ప్రారంభిస్తే అచ్చివస్తుందని ఒక సాధువు చెప్పాడు. తమరు సాయం చేయగలరా?'' అని అడిగాడు.

అప్పుడు కామేశానికి అతణ్ణి ఉపయోగించి రామేశాన్ని ఆటపట్టించాలనిపించి, అతనికి రామేశాన్ని చూపించి, ''నువ్వాయన దగ్గరికి ఒకరొక్కరుగా మనుషుల్ని పంపి-జలుబురాకుండా ఏం చేయాలని అడగమను. ఆయన చెప్పింది విని ఎకసక్కెంగా బదులిమ్మను. ఆయన్ను ఎకసక్కెం చేసిన వారెంత మంది ఉంటే అన్ని వరహాలు నీకిస్తాను,'' అన్నాడు.

ధనరాజు సరేనని ఆయన చెప్పినట్టు చేశాడు. రామేశం మెట్లెక్కుతూ తనను అడిగిన ఒక్కొక్కరికీ ఓపికగా తులసాకుల సలహా ఇచ్చాడు. బదులుగా, ''మా ఊళ్ళో తులసి మొక్కలు లేవు ఉసిరాకులు తినవచ్చా?'' అన్నాడొకడు. ''నాకు జ్ఞాపకశక్తి తక్కువ. రోజూ మా ఇంటికి వచ్చి గుర్తు చేస్తావా?'' అన్నాడు ఇంకొకడు.

అలా ఒక్కొక్కరే రామేశాన్ని వేళాకోళం చేస్తుంటే కామేశానికి చాలా సంతోషం కలిగింది. కొంత సేపయ్యాక ఒకడు ధనరాజు చెయ్యి పట్టుకుని రామేశం దగ్గరికి లాక్కెళ్ళి, ''అయ్యా, ఇతగాడికి మీరంటే ఎగతాళిగా ఉన్నట్టుంది,'' అంటూ జరిగింది చెప్పి వెళ్ళాడు.

రామేశం ధనరాజువంక చూశాడు. అతడు ఏం చెప్పాలో తెలియక కామేశం వంక చూస్తే ఆయన, ''అవును రామేశం, మనమేం చేసినా దానివల్ల కలిగే లాభం-నష్టం బేరీజు వేయాలి. చాదస్తం వల్ల నీకేం లాభం లేదు. నవ్వులపాలు చేస్తుంది. నీకది తెలియాలనే ఈ నాటక మాడించాను,'' అంటూ ధనరాజు కథ చెప్పాడు.

''నా స్వానుభవంలోని తులసాకుల వైద్యం వల్ల ఒక్కడు బాగుపడినా నాకది లాభమే. ఆ ప్రయత్నంలో నన్ను చూసి వెయ్యిమంది నవ్వినా, ఎకసక్కెం చేసినా నాక్కలిగే నష్టం ఏమీ లేదు,'' అన్నాడు రామేశం నవ్వుతూ.

అప్పుడు ధనరాజు రామేశానికి చేతులు జోడించి, ''మిమ్మల్ని నవ్వులపాలు చేయాలనుకున్న ఆయనగారి డబ్బు నాకు వద్దు, అది నాకు అచ్చిరాదు,'' అన్నాడు.

రామేశం అతడికి ఇరవై వరహాలు తీసి ఇచ్చి, ''నువ్వు వ్యాపారం ప్రారంభించు. తులసాకు వైద్యమేకాదు; నువ్వు మంచిదనుకున్న ప్రతి విషయాన్నీ పదిమందికీ తెలియజెయ్యి,'' అన్నాడు. ఆ విధంగా కామేశం రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.





# తీరిన కోరిక

మణిఘంటికాపురంలో శివన్న అనే కాటి కాపరి ఉండేవాడు. పేదవాడే అయినప్పటికీ శివన్న మంచి మనసున్నవాడు. చేసే వృత్తిని దైవసమానంగా భావించేవాడు. సొంత మనుషులను పోగొట్టుకుని దుఃఖంలో వున్నవారిని ఎన్నడూ కట్టెలకోసం, డబ్బుల కోసం ఇబ్బంది పెట్టి ఎరుగడు. ఇచ్చినంత తీసుకునేవాడు. శవం పూర్తిగా కాలే వరకు చితి దగ్గరి నుంచి కదిలేవాడు కాడు.

ఉన్నంతలో జీవితాన్ని తృప్తిగా గడుపుతూన్న శివన్నకు ఒక్కసారి హరిద్వారం వెళ్ళి అక్కడి గంగా నదిలో స్నానం చేయాలని కోరికగా ఉండేది. హరిద్వారం ప్రయాణం ఖర్చుతో కూడుకున్న వ్యవహారం గనక, అది తీరని కోరకగానే ఉంటూ వచ్చింది.

ఇలా ఉండగా ఒకనాడు శివన్నకు ఏ ఊరి పొలిమేరకూ చెందని ఒక చింతతోపులో ఒక అనాధశవం పడివున్నదని తెలిసింది. అతడు వెళ్ళి శవాన్ని భుజాన వేసుకుని శ్మశానం చేర్చి, చితి పేర్చి దహనసంస్కారాలు చేశాడు. అతడా పని చేస్తున్నంతసేపూ ఒక పెద్దమనిషి దూరంగా నిలబడి శివన్నను గమనించసాగాడు.

పని పూర్తయ్యాక శివన్న శ్మశానం సమీపంలోని బావి దగ్గర స్నానం చేసి ఇంటికి బయలుదేరాడు. అప్పుడు అంతసేపూ శివన్నను గమనించిన పెద్దమనిషి అతణ్ణి సమీపించి, ''శివన్నా, మాది లక్ష్మీపురం. నా పేరు నారాయణస్వామి. నీ గురించి చాలా విన్నాను. ఇప్పుడు స్వయంగా చూశాను. నీ మనసులో ఒక తీరని కోరిక ఉందని తెలిసి, దాన్ని తీర్చడానికే వచ్చాను,'' అన్నాడు.

''అయ్యా, తమరే విషయం మాట్లాడుతున్నారో నాకు అంతుబట్టడం లేదు. కాస్త వివరంగా చెప్పండి,'' అన్నాడు శివన్న వినయంగా.

ఎన్. శివనాగేశ్వరరావు

‘‘నీకు హరిద్వారం వెళ్ళి గంగాస్నానం చేయాలని కోరిక ఉన్నట్టు తెలిసింది. నేనూ హరిద్వారం వెళ్ళాలనుకుంటున్నాను. నువ్వు వస్తానంటే నిన్ను నాతో తీసుకువెళతాను,’’ అన్నాడు నారాయణస్వామి.

‘‘అయ్యా, నాకు అంతటి భాగ్యమా!’’ అంటూ కంటతడితో చేతులు జోడించాడు శివన్న. నారాయణస్వామి ఆప్యాయంగా శివన్న భుజం తట్టి, ‘‘వచ్చే పంచమి రోజు హరిద్వారం బయలుదేరుదాం. సిద్ధంగా ఉండు,’’ అని చెప్పి వెళ్ళాడు.

పంచమి నాటి ఉదయం శివన్న గుడిసె ముందు గుర్రపు బగ్గీ వచ్చి ఆగింది. అందులో నారాయణస్వామి కూర్చుని ఉన్నాడు. ఆయన శివన్నను సాదరంగా పిలిచి పక్కన కూర్చో బెట్టుకుని బగ్గీని ముందుకు నడపమని నౌకరును ఆదేశించాడు. నెలరోజుల ప్రయాణం తరవాత వాళ్ళు హరిద్వారం చేరారు. అక్కడి గంగా నదిలో స్నానం చేసి, గంగామాతను పూజించారు. శివన్న జన్మ సాఫల్యం పొంది నంతగా ఆనంద పడ్డాడు. మరో నెల పాటు సాగిన తిరుగు ప్రయాణంలో మార్గ మధ్యం లోని పుణ్యక్షేత్రాలను దర్శించుకుంటూ వచ్చి ఇరువురూ లక్ష్మీపురం చేరారు.

శివన్న ఇంటికి బయలుదేరుతూ చేతులు జోడించి, ‘‘అయ్యా, నా జీవితంలో హరిద్వార దర్శనం చేసుకుంటానని అనుకోలేదు. మీ దయవలన నా కోరిక తీరింది. మీకు జీవితాంతం రుణపడి ఉంటాను,’’ అన్నాడు.

అందుకు నారాయణస్వామి, ‘‘శివన్నా,



నన్ను మరీ అంతగా పొగడవద్దు. నీకు హరిద్వారం చూపించడంలో నాకూ కొంత స్వార్థం ఉంది,’’ అన్నాడు.

‘‘అడగకుండానే నాకా దివ్యక్షేత్రం చూపిన పుణ్య పురుషులు మీరు. మీకు స్వార్థమా? నమ్మను,’’ అన్నాడు శివన్న.

‘‘అవును, శివన్నా. నేను నిజమే చెబుతున్నాను. సముద్ర వ్యాపారం చేసి కోట్లకు కోట్లు సంపాదించాను. కాని మనశ్శాంతి మాత్రం లేదు. ప్రేమాభిమానాలు కరువైపోయాయి. ఉన్న ఇద్దరు కొడుకులూ పరమ స్వార్థపరులు. నేను పోతే వచ్చే ఆస్తి గురించే తప్ప నాక్షేమం గురించి ఆలోచించరు. రేపు నేను చనిపోతే చిత్తశుద్ధితో దహనసంస్కారాలు చేయగలరన్న నమ్మకం కూడా లేదు. ఒకవేళ చేసినా అది నాకు సంతృప్తికరం కాదు. దాన్ని

గురించి ఆలోచిస్తున్నప్పుడే నీ గురించి తెలిసింది. నీలాంటి మంచివాడికి ఉపకారం చేస్తే వృధా పోదని నిన్ను హరిద్వారం తీసుకు వెళ్ళాను. రేపు ఎప్పుడైనా నేను మరణిస్తే నువ్వే నా దహనసంస్కారాలు జరిపించాలి. అందుకు తగ్గ ఏర్పాట్లు ఇప్పుడే చేస్తాను,'' అన్నాడు నారాయణస్వామి బరువెక్కిన మనసుతో.

ఆ మాట విన్న శివన్న చలించిపోయి, ''అయ్యా, మీరు ధర్మప్రభువులు. మీకు అటువంటి స్థితి ఎప్పటికీ రాదు. న లాంటి నిరుపేదకు హరిద్వారం చూపించిన పుణ్యం ఊరకే పోదు. మీ కొడుకు  ్ల మార్పు తెస్తుంది,'' అంటూండగా నారాయణస్వామి ఇద్దరు కొడుకులూ వచ్చి తండ్రి పాదాలపై బడి, ''నాన్నా, మమ్మల్ని క్షమించండి. మీకు అలాంటి స్థితి రానివ్వం. ఇన్నాళ్ళు అజ్ఞానంతో ప్రవర్తించాం. ఇకపై మీ మాట జవదాటకుండా, మీకు ఎలాంటి కొరతా లేకుండా చూసుకుంటాం,'' అన్నారు.

ఒక కాటికాపరితో కలిసి నారాయణస్వామి హరిద్వారం వెళ్ళిన సంగతి తెలిసి ఊళ్ళో నలుగురూ నాలుగు విధాలుగా మాట్లాడుకోవడం విని ఆయన కొడుకులు సిగ్గుతో తలలు దించుకున్నారు. తండ్రి వచ్చిన విషయం తెలిసి, ఆయనకు క్షమాపణలు చెప్పడానికి వెళ్ళి చాటు నుంచి ఆయన మాటలు విన్నారు.

కొడుకుల్లో వచ్చిన మార్పును చూసి నారాయణస్వామి ఎంతగానో సంతోషించాడు. వాళ్ళను చిరునవ్వుతో చూస్తూ కాటికాపరితో, ''శివన్నా, నా కొడుకుల్లో మంచి మార్పు చూడాలన్నది నా తీరని కోరిక. హరిద్వారం చూడాలన్న నీ తీరని కోరిక తీర్చగానే, నా తీరని కోరిక, తీరిన కోరికగా మారిపోయింది,'' అన్నాడు.

''అయ్యా, నాకు హరిద్వార దర్శనం చేయించిన పుణ్యం ఊరికే పోదుకదా. ఎన్నటికైనా మంచివారికి మంచే జరుగుతుంది,'' అన్నాడు శివన్న పట్టరాని ఆనందంతో.

నారాయణస్వామి ఆ తరవాత శివన్న ఉండడానికి మంచి ఇల్లు కట్టించి, అతని జీవనానికి ఎలాంటి లోటూ రాకుండా చూసుకున్నాడు.





# రాకాసిలోయ

## 34

[గణాచారి ముఠావాళ్ళ బారినుంచి బయటపడిన కేశవుడూ అతడి మిత్రులకు, రాకాసి లోయలో జగభోజీ, కింకరుడూ జరిపిన సంభాషణ వినబడింది. బ్రహ్మపుర రాజకుమారి కల్పకవల్లి అక్కడ ఉన్నట్టు తెలిసింది. వాళ్ళకు పులిరాజు కూడా కనిపించింది. లోయ కవతల సైన్యంతో వచ్చి చేరిన బ్రహ్మపుర రాజు, తన గురువుతో లోయలోకి ఎలా ప్రవేశించటం అన్న విషయమై సంప్రతిస్తున్నాడు. -తరవాత]

కొంత చర్చ జరిగిన మీదట బ్రహ్మపుర రాజు, ''గురువర్యా! ఈ సరికే జగభోజి మన రాక తెలుసుకుని వుంటే, వాడు అమ్మాయితో సహా లోయ వదిలి పారిపోయే ప్రమాదం వున్న దని నేను భయపడుతున్నాను,'' అన్నాడు.

రాజగురువు కొంచెం ఆలోచించి, ''మహా రాజా! మీరు అలాంటి భయాలేమీ పెట్టుకో కండి. మన రాక జగభోజికి తెలియదనుకోవటం పొరపాటు. అడవిలో కల్పకవల్లిని వాడు పట్టు కున్నప్పుడు అన్న మాటలు, ఆమె చెలికత్తెలు స్పష్టంగానే విన్నారు. ఈ రాబోయే అమావా స్యకు గాని, వాడి దీక్ష నెరవేరదు. అప్పటి వరకూ ఎన్ని ప్రమాదాలొచ్చినా, వాడు ఈ రాకాసి లోయలోనే వుంటాడు. ఒకవేళ వాడు ఆఖరి నిమిషంలో భయపడి పారిపోదలిచినా, మనం కాపుంచిన, గురు మౌనానందుడూ, కోయ గడేజంగ్ వాడి ప్రయత్నం సాగని వ్వరు,'' అన్నాడు.

'చందమామ'



రాత్రి గడుస్తున్న కొందికీ, లోయకు కొంచెం ఎగువగా రాళ్ళ మీద కూచునివున్న కేశవుడూ అతడి మిత్రులకు, అన్నివైపుల నుంచీ రకరకాల శబ్దాలు వినబడుతున్నవి. వెన్నెల కాంతిలో వాళ్ళకు, దిగువనున్న లోయ స్పష్టంగా కనబడుతున్నది. జయమల్లు లోయ కేసి కొంచెంసేపు పరీక్షగా చూసి, "కేశవా! ఈ వెన్నెల వెలుగులో ఇక్కణ్ణించి మనం లోయలోకి దిగటం ఏమంత కష్టం కాదు. నా ఉద్దేశం, ఆ పులిరాజును సూర్యోదయం లోపలే చంపి, దాని చర్మం వలిచి, నువ్వు ధరించటం మంచిదని. తెల్లవారితే, మన ఉనికి జగభోజికీ, వాడి అనుచరుడికీ తెలిసి పోవచ్చు," అన్నాడు.

"నువ్వన్నట్టు ఆ పని ఎంత త్వరగా ముగించుకుంటే అంత మంచిది. ఈ లోయ చుట్టూ ఎవరో చేరి, మన కంటె ముందుగా లోయలోకి దిగే ప్రయత్నంలో వున్నారని నా అనుమానం. వాళ్ళు శత్రువులో, మిత్రులో మనకు తెలుసుకునే అవకాశం లేదు," అన్నాడు కేశవుడు.

రాజగురువు అన్నట్టే గురు మౌనానందుడూ, కోయ గడేజంగ్ తమ తమ అనుచరులతో రాకాసిలోయ నుంచి పైకి ఎక్కి పారిపోయేందుకు వీలున్న దారులన్నీ వేయి కళ్ళతో కాపలా కాస్తున్నారు. మౌనానందుడి అనుచరుల్లో ముఖ్యులు బిడాలీ, శ్వానకర్ణి; కోయ గడేజంగ్ అనుచరుల్లో ముఖ్యుడు నరమాంస భక్షకుల నాయకుడైన చండ మండూకుడు.

బ్రహ్మపుర రాజు వెంట వీరే కాక పెద్ద సేన కూడా వున్నది. అందులో గజాశ్వదళాలు కూడా వున్నవి. కోయగోమాంగ్ తనకు వినబడుతున్నవని చెప్పే గంటల సవ్వడులు; ఆ గజసైనిక దళాల్లోని, ఏనుగుల మెడలకు వేలాడుతున్నకంచుగంటలు అప్పుడప్పుడు చేసే ధ్వనులు.

ఆ తరవాత ముగ్గురూ, కోయగోమాంగ్ దగ్గిరవున్న విషం పూసిన అంబులను సమానంగా పంచుకుని, ఎగుడు దిగుడుగా వున్న రాళ్ళ మీది నుంచి, అడవి తీగను ఆసరాగా పట్టుకుని, లోయలోకి దిగారు.

లోయ అంతా నిశ్శబ్దంగా వున్నది. ఉండి వుండి ఏదో ఒక మహావృక్షం మీది నుంచి గండభేరుండపక్షి ఒకటి వికృతంగా అరుస్తున్నది. నల్లని చెట్ల నీడలూ, ఆ నీడల్లో అటూ



ఇటూ ఎగిరే మిణుగురుపురుగులూ తప్ప, పులిరాజు అక్కడ వున్న సూచన లేమీ వాళ్ళకు కనిపించ లేదు.

''పులిరాజు ఈ ప్రాంతాలే ఎక్కడో మన కోసం పొంచి కూచుని వున్నదని, నా నమ్మకం. ఈ రాళ్ళ దగ్గిర వుండటం ప్రమాదం. ఆ కనబడే ఎండిన మోడుచెట్టు కేసి నడవండి,'' అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు.

ఆ క్షణంలోనే ఆ ముగ్గురూ సంభ్రమాశ్చర్యాలతో నిశ్చేష్టులయ్యారు. చూస్తూండగానే, ఆ వెన్నెల రాత్రి, అంతవరకూ ఎండిమోడుగా వున్న చెట్టు ఫలపుష్పాలతో నిండిపోయింది.

''కేశవా, మనం జయించాం! ఈ రాకాసి లోయలోని ధనరాసులు మనవే. కాలభైరవుడు నిన్నావేశించి నప్పుడు చెప్పినదొకటి నిజమైంది. ఇక మనకు కావలసింది, ఆ పులిరాజు...''

జయమల్లు మాట ముగించే లోపలే, ఆశ్చర్యంగా ఆ క్షణాన ఫలపుష్పాలతో నిండిపోయిన మోడు చెట్టు వెనక నుంచి, పులి పెద్దగా గాండ్రించిన చప్పుడైంది. మరుక్షణాన కేశవుడు విల్లు అటు కేసి ఎక్కుపెట్టాడు. పులి చెట్టు వెనక నుంచి భయంకరంగా మరోసారి అరిచి, పంజా పైకెత్తి, కేశవుడి కేసి లంఘించబోయింది. కేశవుడు విషబాణాన్ని పులిరాజు రెండు కళ్ళ మధ్య తగిలేలా కొట్టాడు.

పులి ఒక్కసారి గోండ్రించి, చాపచుట్టలా పక్కను పడిపోయింది. కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ పరుగు పరుగున వెళ్ళి దాని కాళ్ళూ నడుమూ పట్టుకుని పైకి లేవనెత్తారు. జయమల్లు చిన్నగొంతుతో, ''నిశ్శబ్దంగా సాధ్యమైనంత త్వరగా ఏదైనా గుహలోకి పదండి. జగభోజి మనం పులిరాజును చంపిన సంగతి ఇప్పుడే గ్రహిస్తే ప్రమాదం. దీని చర్మం వలిచి, కేశవుడు ధరిస్తే చాలు. ఆ తరవాత మన దెబ్బ కిక్కడ తిరుగువుండదు,'' అన్నాడు.

ఆ ముగ్గురూ చచ్చిన పులిరాజును మోసుకుని, దాపులనున్న ఒక గుహలోకి చేరేంతలో జగభోజి కంఠం కర్కశంగా వినిపించింది: ''ఏమిరా శిష్యా, కింకరా! ఈ పులిరాజు నాకు నిద్రలేకుండా చేస్తున్నాడు! పాపం, ఆ రాకన్నె ఎంతగా బాధ పడుతున్నదో! ఎందుకా గాండ్రింపులూ గోండ్రింపులూ?'' అని కేక పెట్టాడు.



''అలాంటి ప్రయత్నాలు చేసే తరుణం ఇంకా రాలేదు,'' అంటూ జయమల్లు గుహలో నుంచి ఓమారు బయటికి తొంగి చూసి, ''ఇక మనం ఇక్కడ సాధించవలసింది ఒకే ఒక కార్యం వున్నది. కాలభైరవుడు చెప్పిన, ఆ పెద్ద రావిచెట్టూ, దాని పాదంలో వున్న పాము పుట్టా ఈ లోయలో ఎక్కడున్నవో కనుక్కోవాలి,'' అన్నాడు.

''ఆ గుర్తుల్ని బట్టి మనం రావిచెట్టును కనుక్కోవచ్చు. అక్కడ వున్న ధనరాసుల్ని తవ్వుకు పోవటం కూడా వెంటనే చేద్దామంటావా?'' అని అడిగాడు కోయగోమాంగ్.

జయమల్లు అతడి ప్రశ్నకు జవాబు చెప్పకుండా, చెవులు రిక్కించి వినసాగాడు. దూరంగా ఎక్కడో మనుషులు అటుకేసే నడిచి వస్తున్న సవ్వడి అతడికి చిన్నగా వినిపిస్తున్నది.

''ధనం మాట తరవాత. ముందు రాజకుమార్తెను ఆ జగభోజి బారి నుంచి కాపాడాలి. మనం ఆమె రాజ్యపౌరులం!'' అన్నాడు కేశవుడు ఆవేశంగా.

జయమల్లు, కేశవుణ్ణి సమీపించి భుజం మీద చెయ్యివేసి, ''కేశవా! కాస్త గొంతు తగ్గించి మాట్లాడు. ఈ లోయలో జగభోజి, కింకరులతో పాటు మరెవరో కూడా వున్నారని నా అనుమానం. జాగ్రత్తగా విను... ఏవైనా అడుగుల చప్పుడులు...

జయమల్లు మాట పూర్తి కాకుండానే, అల్లంత దూరం నుంచి పెద్దగా పిలుస్తున్న ఒక గొంతు వినబడింది: ''సోదరా, జగభోజీ!

''అంతా తెల్లవారి తెలుస్తుంది, గురో! ఆ పులి ఆఖరున పెట్టిన కేక వింటే-అది గాండ్రింపుగానూ లేదు, గోండ్రింపుగానూ లేదు-గొంతులో ప్రాణమేదో గురగురమన్నట్టున్నది. మీరు ఇక హాయిగా నిద్రపొండి. ఉదయమే చూసుకుందాం,'' అన్నాడు కింకరుడు.

గుహలో ప్రవేశించిన కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ కలిసి, క్షణాల మీద పులి రాజు చర్మం వలిచారు. జయమల్లు ఆ చర్మాన్ని కేశవుడి నడుం దగ్గిర నుంచి తిప్పి, భుజం మీదుగా చుట్టాడు. కోయగోమాంగ్ కేశవుడి ఈ కొత్త వేషం చూసి, ఎక్కడలేని ఉత్సాహంతో, ''కేశవా, ఇప్పుడు నీ రూపం చూపరుల్లో భయం, భక్తీ కూడా రేకెత్తించేలా వున్నది. ప్రయత్నిస్తే నువ్వు మా కోయజాతికంతా నాయకుడివి కాగలవు,'' అన్నాడు.

నువ్వెక్కడ? నేను ఇక్కడికి తిరిగి వచ్చాను. ఈ రాకాసిలోయలో నీ కంఠధ్వనీ, పులిరాజు రంకెలూ విని, నా చెవులకు పట్టిన తుప్పు వదిలించుకుందా మనుకున్నాను. కాని మీ రెండు గొంతులూ వినబడవేం?''

ఆ వెంటనే జగభోజి గొంతు పెద్దగా జవా బిచ్చింది: ''సోదరా! ఎవరు? బ్రహ్మదండేనా? ఆహా, ఎంత అదృష్టం! ఎన్నాళ్ళకు తిరిగి వచ్చావు!''

కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళకు బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు భయాశ్చర్యా లను కలిగించింది. సమయానికి ఈ దుర్మా ర్గుడూ ఈ లోయ చేరాడన్న మాట! ఇప్పుడే మిటి కర్తవ్యం?

బ్రహ్మదండి మాంత్రికుడు, జగభోజి నివ సించే గుహను చేరిన గుర్తుగా, అటువైపు నుంచి, మాటల ధ్వనులు వినబడసాగినై. ఒకటి రెండు నిమిషాలు గడిచిన తరవాత, బ్రహ్మదండి గొంతుస్థాయి కాస్త పెంచి, ''సోదరా! నువ్వు, ఆ బ్రహ్మపుర రాకన్నె కల్పకవల్లిని అపహరించుకుని ఇక్కడికి తేవటంలో పెద్ద ప్రమాదాన్ని కొని తెచ్చుకు న్నావు. బ్రహ్మపుర, కపిలపుర రాజ్యాల్లో నివసించే, అనాది ఆటవిక జనాలను వెంట బెట్టుకుని, ఆమె తండ్రి మన రాకాసిలోయను చుట్టు ముట్టాడు. నేను, నీ రక్షణకుగాను, పులుగురాయుడనే ఒక పక్షితల వెధవతో కలిసి ఒక రహస్య సొరంగ మార్గాన ఇక్కడికి వచ్చాను,'' అన్నాడు.



''నా క్షేమం గురించి, నువ్వు పడిన ఆదుర్దా చూసి, నాకు చాలా సంతోషం కలుగుతు న్నది. మనం ఇద్దరం పాతిక ముప్ఫై సంవత్స రాలు, ఒకే గురువు దగ్గిర మంత్రశాస్త్రం అభ్యసించాం. సరే, ఇంతకూ నువ్వెళ్ళినపని, ఏమయింది?'' అని అడిగాడు జగభోజి.

జగభోజి ప్రశ్నకు, బ్రహ్మదండి ఛీత్కారం చేసి, ''మనం గురువు గురువు అనుకునే ఆ నీచుడు, చచ్చి ఎక్కడున్నాడో గాని-వాడు మనకు మనసిచ్చి మంత్రశాస్త్రం బోధించ లేదు. బ్రహ్మపుర రాజ్యంలోని ఒకానొక కొండలో కాలభైరవుణ్ణి ప్రతిష్ఠాపన చేసి, మనకు కావలసిన జాతకుడు, కేశవుడనేవాణ్ణి పట్టుకుని, వాడి చేత ఇక్కడ దొరికే ధనరాసుల విషయం చెప్పించే ప్రయత్నం చేశాను. కాని, నా పని పూర్తయ్యే లోపలే, బ్రహ్మపుర రాజ

గురువు తన మంత్రశక్తితో అక్కడ వున్న అందరి నోళ్ళూ కట్టేశాడు,'' అన్నాడు.

ఆ తరవాత జగభోజీ, బ్రహ్మదండి మాంత్రికుడూ కలిసి లోయలోకి కొంత దూరం వెళ్ళి, అక్కడ చెట్ల కింద కూచుని వున్న పులుగు రాయుణ్ణీ, స్థూలకాయుణ్ణీ, జిత శక్తివర్మలనూ కలుసుకున్నారు. ఆ సమయంలో తూర్పు దిక్కు కొంచెం తెలతెల్లనవుతున్నది.

''ఇక మనం లోయ మధ్యకు పోదాం. ధన రాసులు నిక్షేపమై వున్న రావిచెట్టూ, ఆ పాము పుట్టా ఎక్కడున్నవో, నాకు తెలుసు!'' అంటూ జగభోజి ముందుండి దారి తీశాడు.

జగభోజి, బ్రహ్మదండితో కలిసి గుహవిడిచి పోవటం; రాజకుమారికి కింకరుడి కాపలా సంగతీ-అంతా కేశవుడూ అతడి స్నేహితులూ చూశారు. వాళ్ళకు చీకట్లో ఒక గుహ ముందు అటూ ఇటూ పచారు చేస్తున్న కింకరుడి ఆకారం కనబడింది.

వాళ్ళు ముగ్గురూ, కింకరుడు కాపలా కాస్తున్న గుహదగ్గిరకు వెళ్ళేసరికి, కింకరుడు గుహముందు బయట ఆగి, గుహలో వున్న కల్పకవల్లి నుద్దేశించి, ''హే, రాకుమారీ! బ్రహ్మపుర రాజ్యంలోని సరస్సు దగ్గిర చూడ గానే, నిన్ను నేను ప్రేమించేశాను. నువ్వు మా గురువు జగభోజిని ఎలా ప్రేమించి వివాహ మాడతావో, నా కర్థం కావటం లేదు. అడవి పంది కోరల్లా వున్న వాడి పళ్ళూ, దబ్బనాల్లా పైకి లేచిన వాడి కనుబొమలూ, నెత్తిన చింకికుళాయీ-ఏ కన్య అయినా వాణ్ణి ఎలా ప్రేమిస్తుంది? నన్ను, చూడు! ఈ తలలో వున్న ఈకలు రాజభేరుండానివి! వాటిని సంపాయించేందుకు నేను చేసిన సాహసం...''

కింకరుడు మాట మధ్యలోనే పెద్దగా అరవబోయి, ప్రాణం కడబట్టుతున్న వాడిలా కీచు మన్నాడు. దానికి కారణం, కేశవుడు ఉచ్చు బిగించి విసిరిన అడవితీగ, గురిగా వాడి కంఠానికి పడి బిర్రబిగుసుకుపోవటం.

''కేశవా! వాడు ఊపిరాడక చచ్చేట్టున్నాడు. వాడితో మనకు కొంత పని వున్నది. ఆ ఉచ్చు కాస్త వదులు చెయ్యి,'' అంటూ జయమల్లు రాళ్ళ చాటు నుంచి ఒక్కగెంతున ముందు కురికాడు. కేశవుడు, కింకరుడి మెడకు బిగుసుకు పోయిన ఉచ్చును కొద్దిగా వదులు చేశాడు. -(ముగింపు వచ్చే సంచికలో)






# నీలాంజన చర్య

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఏదైనా పంతానికి దిగి ఇలా భీకర వాతావరణంలో శ్రమ పడుతున్నావేమో అన్న అనుమానం కలుగుతున్నది. నువ్వు ఎలాంటి పంతంలోనైనా నెగ్గగలవనడంలో ఎలాంటి సందేహం లేదు. అయితే, నెగ్గే సమయంలో నీలాంజనలా అయోమయానికిలోనై, విజయాన్ని ప్రత్యర్థుల పాలు చేస్తావేమోనన్న అనుమానం కలుగుతున్నది. సునాయాసంగా చేజిక్కించుకోవలసిన జీవితాన్ని కాలదన్ని, విపరీత చర్యకు పాల్పడిన ఒక గంధర్వ రాకుమారి కథ చెబు

బేతాళ కథలు



అంటూండగా ఆమె అదృశ్యమై కళాధరుడి కల చెదిరి పోయింది. కాని ఆమె రూపం మాత్రం అతడి మనోఫలకం మీద అలాగే నిలిచిపోయింది. మరునాడే అతడు సెల యేటి సమీపంలో శిల్పాన్ని చెక్కడం ప్రారం భించాడు.

కళాధరుడికి కలలో కనిపించిన అందాల రాశి పేరు నీలాంజన. గంధర్వ రాజు కుమార్తె. మరుసటి పున్నమిరేయి చెలికత్తెలతో వన విహారానికి బయలుదేరిన నీలాంజన, వారికో విశేషం చూపుతానని చెప్పి భూలోకానికి వెంటబెట్టుకుని వచ్చింది.

సెలయేటి సమీపంలో నీలాంజన పాల రాతి శిల్పం చూసి చెలికత్తెలు ఆశ్చర్య చకి తులై, ''నీ విగ్రహం ఇక్కడికెలా వచ్చింది?'' అని అడిగారు ముక్తకంఠంతో.

''నేను కలలో కనిపించిన మాత్రాన్నే కళాధరుడనే శిల్పి దీన్ని చెక్కాడు,'' అన్నది నీలాంజన.

''అద్భుతం! దీనికే గనక ప్రాణం వస్తే మరెంత బావుంటుందో,'' అన్నది ఒక చెలి కత్తె.

''ప్రాణమే కాదు, దీనికి నీ తెలివి తేటలు కూడా ఉంటే చక్కని క్రీడ ద్వారా వినోదించ వచ్చు,'' అన్నది రెండవ చెలికత్తె.

''ఏమిటా క్రీడ?'' అని అడిగింది నీలాం జన.

''నువ్వు చాలా తెలివైన దానివని గొప్పలు పోతూంటావు కదూ. దాన్ని భూలోకంలో నిరూపించాలి. నువ్వు ఈ శిల్పానికి ప్రాణం

తాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ప్రియవదనుడనే రాజు పరిపాలించే వైశాలి రాజ్యం దక్షిణ సరిహద్దున ఉన్న త్రిశృంగమనే ప్రాంతంలో కళాధరుడు అనే అద్భుత శిల్ప కారుడు ఉండేవాడు. అతడు చెక్కే శిల్పాలను అందరూ మెచ్చుకునేవారు.

ఒకనాటి పున్నమిరాత్రి అతడు ఆరు బయట పడుకుని ఉండగా కలలో ఒక అద్భుత సౌందర్యరాశి కనిపించి, ''నా విగ్ర హాన్ని నువ్వు మలిస్తే ఎలా ఉంటుందో చూసుకోవాలన్న కోరిక కలిగింది. నా కోరిక తీర్చగలవా?'' అని అడిగింది.

''నీ అంతటి సౌందర్యరాశి శిల్పాన్ని రూపొందించకపోతే నా శిల్పకళా నైపుణ్యానికి సార్థకత ఉండదు. అయినా, నువ్వెవరు?''

పోస్తే మానవకాంత అవుతుంది. ఆమె నువ్వే అయివుండాలి గనక, నీ మనసును, నీ తెలివి తేటలను ఆమెతో పంచుకోవాలి. అంటే నువ్వే ఇద్దరిగా భూలోకంలోనూ, గంధర్వలోకం లోనూ ఉండాలి. భూలోకంలో నీకు అద్భుత శక్తులు ఉండవు గనక, కష్టాలతో కూడుకున్న మానవ సమాజంలో నెగ్గుకురావాలి. సమ్మత మేనా?'' అన్నది మూడవ చెలికత్తె.

''సమ్మతమే,'' అన్నది నీలాంజన.

''మరొక ముఖ్య విషయం. భూలోకంలో ఉండబోయే నీలాంజనకు తానొక గంధర్వ కన్య అన్న విషయం తప్ప మరేదీ జ్ఞాపకం ఉండకూడదు,'' అన్నది నాలుగో చెలికత్తె.

అన్నిటికీ అంగీకరించిన నీలాంజన శిల్పానికి ప్రాణం పోసి చెలికత్తెలతో గంధర్వ లోకానికి తిరిగివెళ్ళింది.

భూలోకంలో అప్పుడే ప్రాణం పోసుకున్న నీలాంజన నిద్ర నుంచి లేచినట్టు తన్ను తాను చూసుకుని ఆశ్చర్యపోయింది. గంధర్వలోకం వెళ్ళడానికి ప్రయత్నించి విఫలమై తను అద్భుత శక్తులు కోల్పోయినట్టు గ్రహించింది. అక్కడి నుంచి లేచి నడుచుకుంటూ తెల్లవారే సరికి ఒక అడవిని సమీపించింది. అక్కడ పొదల చాటు నుంచి ఒక పులి తన మీదికి దాడి చేయడానికి ఆయత్తమవుతూండడం గమనించి, దానిని నిరాయుధపాణిగా ఎదుర్కోబోయింది. అంతలో గాలిని చీల్చుకుంటూ వచ్చిన ఒక బాణం పులిని తాకడంతో, అది భయంకరంగా అరుచుకుంటూ పారిపోయింది.



మరి కొంతసేపటికి గుర్రంపై వచ్చిన ఆజానుబాహువైన ఒక యువకుడు ఆమె చెంత దిగాడు. పులి బారి నుంచి ఆమెను కాపాడింది అతడే. విభారకుడు అతడి పేరు. మెరుపుతీగలాంటి నీలాంజన అందానికి ముగ్ధుడైన విభారకుడు, ''ఎవరు నువ్వు? ప్రమాదభరితమైన ఈ ప్రాంతానికి ఎందుకు వచ్చావు?'' అని అడిగాడు.

''ప్రస్తుతం ఈలోకంలో నా అన్నవాళ్ళు లేరు. గౌరవ ప్రదమైన జీవనోపాధిని వెతుక్కుంటూ వచ్చాను. సాయపడగలవా?'' అన్నది నీలాంజన అతడి పట్ల తనకున్న ఇష్టాన్ని బయటపెట్టకుండా.

''నువ్వు కత్తి పట్టి యుద్ధం చేయగలిగితే నీ ఉద్యోగం సమస్యే లేదు. అవంతీ దేశపు రాజు రాజ్యకాంక్షతో మన దేశంపై యుద్ధం



ప్రకటించాడు. సైనిక బలంలో ఆ రాజు మనకన్నా అధికుడు. అత్యయిక పరిస్థితిని ఎదుర్కోవడానికి మనరాజు ఇంటికొకరు సైన్యంలో చేరవలసిందిగా ప్రకటించాడు. అందుకే నేను వెళుతున్నాను. నువ్వు పురుష వేషంలో సైన్యంలో చేరి, నీ శక్తి ద్వారా స్త్రీలు అబలలు కారని నిరూపించి, ఆ తరవాత నిజం చెప్పవచ్చు,'' అన్నాడు విభారకుడు.

''నీ ఆలోచన బావుంది,'' అన్న నీలాంజన పురుషవేషం ధరించి అతనితో కలిసి వెళ్ళి సైన్యంలో చేరింది.

మరుసటి రోజు బలవంతుడైన శత్రువును ఎదుర్కోవడం ఎలాగా అని రాజు మంత్రులతో, సేనాధిపతితో, చర్చిస్తూండగా పురుష వేషంలోని నీలాంజన రాజును దర్శించి, ''మహారాజా, నేనొక వ్యూహం రచించాను. అది మీకు నచ్చితే ఆచరించండి. లేకుంటే నా శిరశ్ఛేదం చెయ్యండి,'' అన్నది.

''ఏమిటో చెప్పు,'' అన్నాడు రాజు ఆత్రుతగా.

'శత్రువు మనకన్నా బలవంతుడైనప్పుడు వెంటనే ముఖాముఖి పోరాడకూడదు. మొదట యుక్తిగా అతణ్ణి చీకాకుపెట్టాలి. శత్రు సైన్యంలో అలజడి పుట్టించి అతడి ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీయాలి. ఆ తరవాత యుద్ధానికి దిగాలి,'' అంటూ తన వ్యూహరచనను వివరించింది నీలాంజన.

అది రాజుకెంతో నచ్చి వెంటనే అమలు పరిచాడు. మొదట వైశాలి సైన్యంలోని విలుకాండ్రు రహస్యంగా తూర్పుకొండలను చేరుకున్నారు. అక్కడి నుంచి అకస్మాత్తుగా బాణాల ద్వారా తేళ్ళను, సర్పాలను ఆ తరవాత మంటలను అవంతి సైన్యం మధ్యలోకి వదిలారు. దాంతో ఆ సైన్యం గందరగోళానికి గురయింది. ఆ తరవాత వాళ్ళ మీదికి వేటకుక్కలను ఉసిగొల్పారు. శత్రు సేనలు చీకాకుగా ఉన్న సమయంలో నాలుగు వైపుల నుంచీ వైశాలి సేనలు దాడి చేసి చిత్తుచేశారు. అవంతి ఓడిపోయి రాజు బందీ అయ్యాడు. వైశాలి ప్రజలు సంబరాలు జరుపుకున్నారు.

రాజు పురుషవేషంలోని నీలాంజనను ఎంతగానో మెచ్చుకున్నాడు. అప్పుడు నీలాంజన పురషవేషం తొలగించి, ''మహారాజా, మిమ్మల్ని పురుషుడిగా మభ్యపెట్టినందుకు నన్ను క్షమించండి. నాకు నా అన్నవారు ఈ లోకంలో లేరు,'' అన్నది.

ఆమె స్త్రీ అని తెలియగానే మహారాణి పరమానందం చెంది, ''వారసులు లేని మనం ఆమెను దత్తత తీసుకుందాం,'' అన్నది రాజుతో. రాజు కూడా సంతోషించి నీలాంజ నను దత్తత తీసుకోవడమే గాక, వైశాలి రాజ్య సామ్రాజ్ఞిగా పట్టాభిషేకం చేశాడు. నీలాంజన, విభాకరుడు పరస్పరం ప్రేమించుకుంటు న్నారని తెలియడంతో వారి పెళ్ళి ఏర్పాట్లు ప్రారంభించారు రాజదంపతులు.

ఆ విధంగా తన తెలివితో ఉన్నత స్థానానికి ఎగబ్రాకి గంధర్వలోకంలోని చెలికత్తెలు పెట్టిన పరీక్షలో నెగ్గింది నీలాంజన. భూలో కపు నీలాంజన, గంధర్వ లోకపు నీలాంజన ఇరువురికీ ఒకే మనసు కావడంతో, సున్నిత మైన సందర్భాలలో భూలోక నీలాంజనకు కలిగే భావోద్వేగాలు గంధర్వలోక నీలాంజ నకు కూడా కలగసాగాయి. విభాకరుడి పట్ల ఆమె మనసులోనూ ప్రేమ అంకురించ డంతో, ఆమె భూలోక నీలాంజనకు అంతం పలకాలని, ఆమె ఉన్న ఏకాంతమందిరానికి వచ్చింది. ఆమెను చూసి, ''అచ్చం నా ప్రతి బింబంలా ఉన్నావు. ఎవరు నువ్వు?'' అని అడిగింది భూలోక నీలాంజన ఆశ్చర్యంతో.

''నేను కాదు. నువ్వు నా ప్రతిబింబం. నువ్వు నా రూపంలోని ఒక శిల్పానివి. నీకు ప్రాణం పోసింది నేనే. నీలో ఉన్నది కూడా నామనసే. నెచ్చెలులతో క్రీడావినోదం కోసం నిన్ను పంపాను. ఇప్పుడు నీ పాత్రకు ముగింపు పలకడమే తరువాయి. అందుకే వచ్చాను,'' అన్నది గంధర్వలోక నీలాంజన.



''జీవితంలో నువ్వెప్పుడైనా ఓడిపోయావా?'' అని అడిగింది భూలోక నీలాంజన.

''లేదు,'' అన్నది గంధర్వలోక నీలాం జన.

''నీ మనసే నాలో ఉన్నప్పుడు నీకున్న మనోబలం నాకూ ఉంటుంది కదా? నీ చేతిలో నేనెలా ఓడిపోగలను? నా పాత్రకు ముగింపు పలకడం నీకు సాధ్యం కాదు,'' అన్నది భూలోక నీలాంజన దృఢమైన కంఠ స్వరంతో.

''నీలో కలిగే స్పందనలే నాలో కలుగుతు న్నాయి. అది నాకు కష్టంగా ఉంది. మన ఇద్దరిలో ఒకరి జీవితం పరిసమాప్తమై పోవాలి. కష్టాలు అనుభవిస్తూన్న మానవ కాంతవైన నీ పాత్రకు ముగింపు పలకడం న్యాయం,'' అన్నది గంధర్వలోక నీలాంజన.

''నేను కష్టాలు అనుభవించడం లేదు. నువ్వు మానవులను తక్కువ అంచనా వేస్తున్నావు. స్వశక్తితో మనుషులు ఎన్నో ఘన కార్యాలు సాధిస్తున్నారు. ఇక్కడి ఆప్యాయతలూ, అనురాగాలూ విశిష్టమైనవి. నిదానంగా ఆలోచించి నిర్ణయం తీసుకో,'' అన్నది భూలోక నీలాంజన.

గంధర్వలోక నీలాంజన తీవ్రంగా ఆలోచించి, హృదయం నుంచి పుట్టిన అగ్నిలో తన్ను తాను దహించుకుని భస్మమై పోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తను ప్రాణం పోసిన పాత్రకు ముగింపు పలికే సామర్థ్యం ఉండి కూడా, నీలాంజన ఆత్మాహుతికి ఎందుకు పాల్పడింది? భూలోక నీలాంజనతో మనసు భాగం పంచుకున్న తరవాత ఆమె వివేకాన్ని కోల్పోవడమే ఈ విపరీత చర్యకు కారణమా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''గంధర్వలోక నీలాంజన తన శిల్పానికి ప్రాణం పోశాక, భూలోక నీలాంజన సాధించిన విజయాల ద్వారా భూలోకవాసుల శక్తిసామర్థ్యాలను తెలుసుకునే అవకాశం ఆమెకు కలిగింది. భూలోక నీలాంజన మాటల ద్వారా మానవులు మహోన్నతులన్న విషయం ఆమెకు మరింత స్పష్టమయింది. ఈ స్థితిలో భూలోక నీలాంజన స్వయంగా నిర్మించుకున్న జీవితాన్ని కాజేయడం ఆమెకు ఆమోదయోగ్యం కాదు. పైగా, ఇరువురి మనసులూ ఒకటే గనక, ఇరువురి మనసుల్లోనూ విభాకరుడు ఉన్నప్పటికీ, అతడు ప్రేమించింది భూలోక నీలాంజనను మాత్రమే. అసలు విషయాన్ని దాచి విభాకరుణ్ణి వివాహమాడడం; ఒకవేళ అతడు నిరాకరిస్తే భగ్న ప్రేమికురాలిగా జీవించడం, ఆత్మాభిమానం గల నీలాంజనకు సాధ్యం కాని పనులు. ఇవన్నీ ఆలోచించే ఆమె ఆత్మాహుతికి పాల్పడింది. ఇదంతా నెచ్చెలుల క్రీడావినోదం తీసుకువచ్చిన అనూహ్య ప్రమాదం,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]






Hey Pals, be a part of the Great Ghatothkach Contest!

Answer the quiz below and win fabulous prizes from Ghatothkach!*

Who is Ghatothkach 's father?

a) Arjun; b) Bheem; C) Nakul

Conditions apply

The first 50 winners will win exciting Ghatothkach movie merchandise.

*Send your answers pronto to*

Great Ghatothkach Contest, CHANDAMAMA INDIA LTD. JVL Plaza Block-A, 6th Floor, 626 Anna Salai, Teynampet, Chennai-18

Not patient enough to post your answers? Email them at Great_Ghatoth@chandamama.com



# ఘటోత్కచుడు

భీమసేనుడికీ, హిడింబకూ జన్మించినఘటోత్క చుడు తండ్రికి సాటి రాగల బలపరాక్ర మాలూ, తల్లికి మించిన రాక్షస మాయలూ ప్రదర్శించిన వీరుడు. రాక్షసి కడుపున పుట్టి నప్పటికీ సద్వర్తనుడు. పాండవులకు విధే యుడై వారికి అండగా నిలబడ్డాడు. అతడి జన్మవృత్తాంతం చాలా ఆసక్తి కరమైనది:

పాండవులు వారణావతంలోని లక్క ఇంటి నుంచి తప్పించుకుని అర్ధరాత్రి సమ యంలో సొరంగ మార్గం గుండా అరణ్యం చేరారు. కటిక చీకటిలో చాలా దూరం నడిచి గంగానదిని దాటి దక్షిణ దిశగా వెళ్ళారు. చాలాసేపు నడిచి బాగా అలిసిపోయి ఒక మర్రి చెట్టు కింద పడుకున్నారు. భీముడు వాళ్ళకు కాపలా కాయసాగాడు.

ఆ వనంలో హిడింబుడనే రాక్షసుడు ఉండే వాడు. వాడు ఆహారం కోసం అరణ్యమంతా తిరిగి, ఒక మద్ది చెట్టెక్కి జుట్టు విదిలించు కుంటూ, ఆవులిస్తూ చూస్తూండగా, వాడికి దూరాన మర్రి చెట్టు కింద పడుకుని కొందరు మనుషులు కనిపించారు. వాడు తన చెల్లెలైన హిడింబను పిలిచి, ''ఆ మర్రి చెట్టు కింద నిద్రపోతూన్న వారిని చంపి తీసుకురా, కడుపు నిండా తిందాం,'' అన్నాడు.

హిడింబ సరేనని బయలుదేరి పాండవు లున్న చోటికి వచ్చి, నిద్రపోతూన్న కుంతినీ, ధర్మరాజునూ, అర్జునుణ్ణీ, నకుల సహదేవు లనూ; వారికి కాపలా కాస్తున్న భీముణ్ణీ చూసింది. హిడింబ కంటికి భీముడు నవ మన్మథుడిలా కనిపించాడు. వెంటనే సుందర మైన రూపం ధరించి, సిగ్గుతో కూడిన చిరు నవ్వులు చిందిస్తూ వచ్చి భీముడితో, ''మీరు ఎందుకు ఇక్కడికి వచ్చారు? మిమ్మల్నంద రినీ చంపి ఆహారంగా తెమ్మని మహాబలుడైన

రాక్షసుడైన మా అన్న నన్ను పంపాడు. కాని నిన్ను చూడగానే నాలో నిన్ను పెళ్ళాడాలనే కోరిక కలిగింది. నన్ను పెళ్ళాడి నా కోరిక తీర్చావంటే మీకు మా అన్న భయం లేకుండా కామగమనం గుండా మిమ్మల్ని ఈ క్షణమే సురక్షిత ప్రాంతానికి చేరుస్తాను,'' అన్నది.

వెళ్ళిన హిడింబ రావడానికి ఆలస్యం కావడంతో హిడింబుడు అక్కడికి వచ్చి చెల్లెలి అందమైన రూపం చూసి, మండిపోయి, ''వాళ్ళను చంపి తీసుకురమ్మంటే, మానవ రూపంతో వాళ్ళతో సంబంధం పెట్టుకోవడానికి చూస్తున్నావా? మొదట వాళ్ళను చంపి, నీ ప్రాణం కూడా తీస్తానుండు,'' అంటూ భీముడితో తలపడ్డాడు.

భీముడు వాణ్ణి దూరంగా లాక్కు పోయాడు. ఇద్దరికీ ఘోరంగా యుద్ధం జరిగింది. భూమి అదిరింది. చెట్టు చేమలు కూలాయి. హిడింబుడు భయంకరంగా పెడబొబ్బ పెట్టాడు. అరుణోదయమవు తూండగా భీముడు హిడింబుణ్ణి పట్టి గిరగిరా తిప్పి నేలకేసి కొట్టి, నడుము విరిచి చిత్రవధ చేశాడు. హిడింబుడు పెద్దగా అరుస్తూ ప్రాణాలు వదిలాడు.

అంతలో హిడింబ తన గురించీ, తన అన్న గురించీ-కుంతీదేవికీ, ధర్మరాజుకూ వివ రించి, తన మనసులోని కోరికను బయట పెట్టింది. ఆమెను వివాహమాడడానికి భీముడు మొదట వెనుకాడినప్పటికీ, తల్లీ, అన్నా చెప్పడంతో హిడింబకు కొడుకు పుట్టేంత



వరకూ ఆమెను తన భార్యగా చూసుకోవ డానికి ఒప్పుకున్నాడు.

హిడింబ భీముణ్ణి తీసుకుని ఆకాశ మార్గాన వెళ్ళిపోయింది. ఇద్దరూ పర్వత శిఖరాలపైనా, కొండ గుహల్లోనూ, నదీ తీరాలా, సరస్సులవద్దా, అందమైన పొదరిళ్ళలోనూ విహరించారు. కాలక్రమాన హిడింబ గర్భ వతియై ఒక కొడుకును కన్నది. వాడు పుట్టు తూనే కామరూపుడై, అప్పటికప్పుడే పెరిగి పెద్దవాడే తల్లిదండ్రులకు, పెద్దలకు మొక్కి నిలబడ్డాడు. వాడి నెత్తిన ఒక్క వెంట్రుక కూడా లేకుండా ఉండడం వల్ల వాడికి ఘటోత్క చుడు అంటే కేశరహితమైన కుండలాంటి తల కలిగినవాడు అనే పేరు పెట్టారు.

ఘటోత్కచుడు పెద్దలకు మొక్కి, ''మీకు నా వల్ల ఏదైనా పనిపడితే నన్ను



తలుచుకోండి. తక్షణమే మీ ఎదుట నిలుస్తాను,'' అని చెప్పి ఉత్తర దిశగా బయలుదేరాడు. మహావీరుడిగా రాక్షసులకు నాయకుడై మేఘవర్ణుడు, అంజన పర్వుడు అనే ఇద్దరు కొడుకులను కన్నాడు.

మహాభారత యుద్ధంలో కౌరవ సేనలను ముప్పతిప్పలు పెట్టి చీల్చి చెండాడాడు. భగదత్తుడికీ, ఘటోత్కచుడికీ యుద్ధం చిత్రంగా జరిగింది. భగదత్తుడు పెద్ద ఏనుగును ఎక్కి పాండవ సైన్యాన్ని చిందరవందర చేశాడు. తమను కాపాడేవాళ్ళు లేక పాండవ సేనలు పారిపోయాయి. ఘటోత్కచుడు అకస్మాత్తుగా మాయమయ్యాడు. కౌరవ సేనలలో హాహాకారాలు చెలరేగాయి. ఘటోత్కచుడు మళ్ళీ కనిపించి భగదత్తుడి మీద బాణవర్షం కురిపించి అదృశ్యమయ్యాడు.

అర్జున కుమారుడైన ఇరావంతుడు భయంకరంగా యుద్ధం చేసి మూర్ఛపోయి ఉన్నప్పుడు ఆర్షభృంగుడనే రాక్షసుడు కత్తితో అతణ్ణి నరికి చంపాడు. దానిని చూసి ఘటోత్కచుడు ఆగ్రహోదగ్రుడై భయంకరాకారంతో చేతిలో మెరిసే శూలాన్ని పట్టుకుని రాక్షస గణాలతో కౌరవ సేనల మీద విరుచుకు పడ్డాడు. దుర్యోధనుడు ఘటోత్కచుడికి ఎదురు వచ్చి సింహనాదం చేశాడు. అతడి వెనకగా ఏనుగుల సేన వచ్చింది. రాక్షసులు ఏనుగు సేనల మీద పడి ధ్వసం చేయసాగారు. ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి ఎదుర్కొని, తన చేతిలోని శక్తిని అతడిపై విసిరాడు. అంతలో వంగదేశపు రాజు తను ఎక్కిన ఏనుగును దుర్యోధనుడి రథానికి అడ్డంగా తోలాడు. ఘటోత్కచుడు విసిరిన

శక్తి తగిలి ఆ ఏనుగు కూలిపోయింది. వంగ రాజు దానిపై నుంచి కిందికి దూకి తప్పించుకుని పారిపోయాడు. ఘటోత్కచుడు విజృంభించి భయంకరంగా అరుస్తూ దుర్యోధనుణ్ణి పీడించసాగాడు.

భీష్ముడి సలహా మేరకు ద్రోణుడు-సోమదత్తుడూ, సైంధవుడూ మొదలైన వీరులతో కలిసి దుర్యోధనుడికి సాయంగా వెళ్ళాడు. ఘటోత్కచుడు వాళ్ళందరినీ కూడా భయంకరంగా హింసించాడు. అంతలో ధర్మరాజు కోరిక మేరకు అభిమన్యుడూ, ఉపపాండవులూ మొదలైన వారిని వెంటబెట్టుకుని భీముడు ఘటోత్కచుడికిసాయంగావెళ్ళాడు. ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో పాండవులదే పైచెయ్యి అయింది.

ఆ తరవాత దుర్యోధనుడు భీముణ్ణి ఎదుర్కొన్నాడు. భీముడు దెబ్బ తినడంతో ఘటోత్కచుడూ, అభిమన్యుడూ మొదలైన పాండవవీరులు దుర్యోధనుణ్ణి చుట్టుముట్టారు. అది తెలిసి ద్రోణుడు కౌరవ వీరులను వెంటబెట్టుకుని దుర్యోధనుడికి సాయంగా వచ్చాడు. అప్పుడు సాగినయుద్ధంలో ఘటోత్కచుడు రాక్షస మాయలు ప్రయోగించి శత్రుసేనలకు దిగ్భ్రమ కలిగించాడు. ఘటోత్కచుడి దెబ్బకు తట్టుకోలేక కౌరవ సైన్యాలు చెల్లాచెదరై శిబిరాలకేసి పరిగెత్తసాగాయి. ఆ తరవాత భీష్ముడి సలహా ప్రకారం భగదత్తుడు సుప్రతీకమనే ఏనుగునెక్కి పాండవుల సేనల మీదికి వెళ్ళాడు. ఘటోత్కచుడు ఎదుర్కొన్నాడు. ఇరువురికీ భీకరంగా యుద్ధం జరిగింది.

ఆపిమ్మట భీష్ముడు యుద్ధ రంగంలో దిగి పాండవ సేనలను నాశనం చేశాడు. ఆఖరికి శిఖండిని అడ్డు పెట్టుకుని వచ్చిన అర్జునుడిపై బాణాలు ప్రయోగించలేక, అంపశయ్యపాలయ్యాడు.

ఆ తరవాత యుద్ధానికి వచ్చిన కర్ణుడు, ఆర్షభృంగుణ్ణీ, అలాయుధాసురుణ్ణీ సంహరించి తన మీదికి వచ్చిన ఘటోత్కచుడి ధాటికి తట్టుకోలేకపోయాడు. అన్నాళ్ళు అర్జునుడి మీద ప్రయోగించాలని భద్రంగా ఉంచిన ఇంద్రుడిచ్చిన శక్తిని ఘటోత్కచుడి మీదికి ప్రయోగించడంతో అతడు వీరమరణం పొందాడు.



## బీర్బల్ కథలు : 10

# శిక్షను తగ్గ న్యాయం!

అక్బర్ చక్రవర్తి ఒకనాటి ఉదయం రాజ భవనం ఉపరితలంలో పచార్లు చేస్తున్నాడు. చల్లని గాలులతో ఉద్యానవనం నుంచి వీచిన పువ్వుల పరిమళం ఆయనకెంతో ఆనందం కలిగించింది. ఉద్యానవనంలోకి వెళ్ళి పువ్వులను చూడాలనుకుని చకచకా మేడ మెట్లు దిగి ఉద్యానవనం కేసి అడుగులు వేశాడు.

అప్పుడే వికసించిన రకరకాల పువ్వులు, ముఖ్యంగా రంగు రంగుల గులాబీలు మెల్లగా వీచే గాలులకు తలలూపడం చూసి చక్రవర్తి పరమానందం చెందాడు.

అలా తన్మయత్వంతో నడుస్తూన్న చక్రవర్తి ఎడమ కాలికి హఠాత్తుగా ఏదో బలంగా అడ్డు తగలడంతో తూలిపడబోయి నిలదొక్కుకున్నాడు. కాలు జివ్వుమనడంతో పక్కనున్న బండ మీద కూర్చుని కాలిని చూశాడు. బొటన వేలు నెత్తురుగడ్డలా ఎర్రగా కమిలిపోయింది. పక్కకు తిరిగి చూస్తే నడిచే దార్లో మొనదేలిన రాయి కనిపించింది. బొటన వేలిని చూస్తున్న కొద్దీ బాధకు మించిన కోపం ఆయన తలకెక్క సాగింది. ''ఎక్కడ? తోటమాలి ఎక్కడ? ఇదా ఉద్యానవనాన్ని పెంచే తీరు?'' అంటూ కేకలు వేయసాగాడు. ఆ సమయంలో తోటమాలి కత్తి, కత్తెర, పార లాంటి పనిముట్లు తెచ్చుకోవడానికి తన గుడిసెకు వెళ్ళాడు. ఎంతకూ ఒక్కరూ కనిపించకపోయేసరికి చక్రవర్తి ఆగ్రహం మరింత పెరగసాగింది. ''వీణ్ణి ప్రాణాలతో వదలకూడదు,'' అని పటపటా పళ్ళుకొరుకుతూ భవనానికి వెనుతిరిగాడు.

భవన ద్వారాన్ని చేరి చప్పట్లు చరచగానే కాపలా భటుల అధికారి వచ్చి సలాం చేశాడు. ''వెంటనేవెళ్ళి, తోటమాలిని పట్టుకు వచ్చి, చెరసాలలో బంధించు. తెల్లవారగానే, వాడికి మరణ దండన!'' అన్నాడు చక్రవర్తి.

చిత్తం అన్నట్టు అధికారి వంగి వెనక్కు అడుగు వేయబోతూండగా చక్రవర్తి, ''ఆ దుర్మార్గుడి అజాగ్రత్త కారణంగా నా కాలికి గాయమయింది. ఉద్యానవనంలో నడిచే దారులను రాయిరప్పలు లేకుండా శుభ్రంగా ఉంచాలన్న కనీస జ్ఞానం ఆ వెధవాయికి లేదు. వాడికి మరణమే తగిన శిక్ష,'' అన్నాడు మళ్ళీ.





అధికారికి ఇది మరీ పెద్ద శిక్షగా తోచింది. కాని చక్రవర్తితో వాదించ లేడు గనక, మరిద్దరు భటులను వెంటబెట్టుకుని తోటమాలిని వెతుక్కుంటూ బయలుదేరాడు.

భటులను చూడగానే తోటమాలి చెయ్యెత్తి సలాం చేసి, ''ఇక్కడికి ఏ పనిమీద వచ్చారు?'' అని అడిగాడు వినయంగా.

''బాదుషా ఆజ్ఞను నెరవేర్చడానికి మేము వచ్చాం. ఇప్పుడు నిన్ను పట్టుకుపోయి చెరసాలలో బంధించాలి. తెల్లవారగానే ఉరిశిక్ష!'' అన్నాడు అధికారి.

''నేను చేసిన అపరాధమేమిటి?'' అని అడిగాడు తోటమాలి నిర్ఘాంతపోతూ. అధికారి కారణం వివరించాడు. ఆ మాట వినగానే తోటమాలి ముఖం వెలవెలబోయింది. భటులు తోటమాలి చేతులకు సంకెళ్ళు తగిలించారు.

తోటమాలి భార్య అధికారి కాళ్ళపై బడి, ''అయ్యా, నా భర్త ఎలాంటి తప్పూ చేయలేదు. దయచేసి వదిలిపెట్టండి,'' అని భోరున విలపించింది.

''నువ్వు ఎంత మొరపెట్టుకున్నా మేము నీ భర్తను వదిలిపెట్టలేము. ఇది చక్రవర్తిగారి ఆజ్ఞ,'' అన్న అధికారి కొంతసేపు ఆగి, ''మరణ దండన నెరవేర్చడానికి రేపు తెల్లవారే వరకు సమయం ఉంది గనక, నువ్వు ఒక పనిచెయ్,'' అన్నాడు.

''ఏమిటి బాబూ?'' అని అడిగింది తోటమాలి భార్య.

''నీ భర్తను కాపాడగల వ్యక్తి, బీర్బల్ ఒక్కడే. ఆయన దగ్గరికి వెళ్ళి నీ సమస్యను వివరించు. ఆయన తప్పక నీ భర్తను కాపాడగలడు,'' అని చెప్పి అధికారి తోటమాలిని చెరసాలకేసినడిపించాడు.

తోటమాలి భార్య పరిగెత్తిపోయి బీర్బల్ కాళ్ళు పట్టుకుని తన భర్తకు కలిగిన ప్రాణాపాయాన్ని వివరించి, కాపాడమని వేడుకున్నది కన్నీళ్ళు కారుస్తూ.

అంతా విన్న బీర్బల్, ''నీ భర్త నిరపరాధి అయితే, అతడు తప్పకుండా ప్రాణాలతో బయటపడతాడు. నీకు తప్పక న్యాయం జరుగుతుంది. విచారించకు,'' అని ఆమెను ఓదార్చి పంపాడు.

ఆ తరవాత ఆయన కాపలా భటుల అధికారిని కలుసుకుని, జరిగినదంతా విన్నాక, ''తోటమాలిని బంధించినచెరసాలవద్దకు వెళదాం, పద,'' అన్నాడు.

అధికారి ఆయన్ను చెరసాల వద్దకు తీసుకు

వెళ్ళాడు. జైలు అధికారి బీర్బల్‌ను చూడగానే నమస్కరించాడు. బీర్బల్ జైల్లో మౌనంగా తలవంచుకుని కూర్చున్న తోటమాలిని దగ్గరికి పిలిచి అతడి చెవిలో ఏదో రహస్యంగా చెప్పి, ''నేను చెప్పినట్టు చెయ్యి. నువ్వు తప్పక ప్రాణాలతో బయట పడగలవు,'' అన్నాడు.

తోటమాలి భయంతో వణికి పోతూ, అదెలా సాధ్యం అన్నట్టు చూశాడు.

''నీకు బతకాలని ఉంటే, నేను చెప్పినట్టు చెయ్,'' అంటూ అక్కడినుంచి బయలుదేరాడు బీర్బల్.

మరునాడు నిండుసభలో బీర్బల్ హాస్యోక్తికి అక్బర్ చక్రవర్తి నవ్వుతూండగా, కాపలా భటుల అధికారి వచ్చి వంగి సలాం చేసి నిలబడ్డాడు. ''ఏమిటి చెప్పు,'' అన్నట్టు చక్రవర్తి చూడగానే, ''మరణశిక్ష అనుభవించడానికి ముందు, తోటమాలి ప్రభువుల దర్శనం చేసుకోవాలంటున్నాడు,'' అన్నాడు అధికారి.

''సరే, లోపలికి తీసుకురా,'' అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి. తోటమాలి సంకెళ్ళతో సభలోకి వచ్చి, చక్రవర్తి ముందుకు వెళ్ళి, మోకాళ్ళ మీద వంగి నమస్కరించాడు. ఆ తరవాత లేచి నిలబడి తుపుక్కున నెలపై ఉమ్మాడు.

''ఎంత పొగరు! ఎంత పొగరు!'' అన్నాడు ఆగ్రహం చెందిన చక్రవర్తి.

''ప్రభూ! చిన్న పొరబాటు దొర్లినందుకు తమరు నాకు మరణశిక్ష విధించారు! నాకు అన్యాయం జరిగిందని ప్రజలు అనుకోవచ్చు. అందువల్ల పెద్దనేరం చేసి ఆ శిక్షకు తగ్గ న్యాయం చేయాలనుకున్నాను. ప్రభువుల సమక్షంలో సభలో ఉమ్మినవాడు మరణశిక్షకు అర్హుడే కదా?'' అన్నాడు తోటమాలి ఏమాత్రం తొణక్కుండా. చక్రవర్తి అందులోని తర్కం గ్రహించి, తల పంకిస్తూ, ''నిన్నిలా సభలో ఉమ్మమని సలహా ఇచ్చిన వారెవరు?'' అని అడిగాడు.

తోటమాలి బీర్బల్ కేసి చూశాడు. అసలు విషయాన్ని గ్రహించిన చక్రవర్తి, ''బీర్బల్, తొందర పాటుతో తోటమాలికి మరణదండన విధించాను. ఆ విషయాన్ని గ్రహించేలా చేసి ఒక నిరపరాధి ప్రాణాలు కాపాడినందుకు కృతజ్ఞతలు మిత్రమా! తోటమాలి విశ్వాసపాత్రుడైన సేవకుడు. అతణ్ణి క్షమించి వదిలి పెడుతున్నాను,'' అన్నాడు.

తోటమాలి వంగి సలాం చేసి చక్రవర్తికి కృతజ్ఞతలు చెప్పాడు.

''నువ్వు కృతజ్ఞతలు చెప్పవలసింది బీర్బల్‌కు. నీ ప్రాణాలు కాపాడింది అతడే!'' అన్నాడు అక్బర్ చక్రవర్తి నవ్వుతూ.









# ప్రత్యేక సంచిక ఆవిష్కరణ

చందమామ, ముంబై జియోడెసిక్ గ్రూప్ కంపెనీల చరిత్రలో ఏప్రిల్ 17వ తారీఖు ఒక ఉజ్వలమైన రోజు. చందమామ అరవై వసంతాలు పూర్తి చేసుకున్న సందర్భంగా వెలువరించిన చందమామ ప్రత్యేక సంచిక 'కలెక్టర్స్ ఎడిషన్'ను అమితాబ్ బచ్చన్ ముంబైలో ఆ రోజు సాయంకాలం జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో ఆవిష్కరించారు. చందమామ తనకు కొత్త కాదనీ, తమ లక్నో ఇంట్లో ఆ పత్రికను ఇతర పత్రికలలో పాటు చిన్నప్పుడు చదివేవాడిననీ ఆ సందర్భంగా అమితాబ్ చెప్పారు. తను బాల్యంలో చదివి ఆనందించినట్టే ఇప్పుడు తన మనవలు చందమామను చదవాలని ఆశిస్తున్నట్టు ఆయన తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. చందమామ వ్యవస్థాపకులు శ్రీ బి. నాగిరెడ్డి గారికి నివాళులర్పిస్తూ బాలసాహిత్యానికీ, చిత్ర పరిశ్రమకూ ఆయన చేసిన సేవలు చిరస్మరణీయమని అమితాబ్ కొనియాడారు.

వ్యవస్థాపకులు శ్రీ బి. నాగిరెడ్డి–చక్రపాణిగార్ల ఉదాత్త ఆశయాల గురించి విపులీకరించిన చందమామ సంపాదకుడు–ప్రచురణకర్త విశ్వం మన పురాణేతిహాసాల గురించీ, ఉన్నతమైన వారసత్వం గురించీ బాలబాలికలందరికీ తెలియజేయడానికి మీడియాతో సహా అందరూ కృషిచేయాలనీ, అప్పుడే వాళ్ళ హృదయాలలో మాతృభూమి పట్ల గౌరవమర్యాదలూ, దేశభక్తీ పెంపొందగలవని ఉద్ఘాటించారు.

చందమామ ఇండియా లిమిటెడ్ సిఇఓ ఎల్. సుబ్రమణియన్ ఉపన్యసిస్తూ, 'కలెక్టర్స్ ఎడిషన్' సంచిక చందమామను చదువుతూ పెరిగిన లక్షలాది మంది భారతీయుల సుమధుర బాల్యస్మృతులను గుర్తుచేయగలదని చెప్పారు.

ఈ 196 పేజీల ఇంగ్లీష్ కాఫీ టేబుల్ బుక్ ఇంగ్లీషు చందమామలో వెలువడిన కథల నుంచి ఎంపిక చేసిన కొన్ని కథలు; ఛాయాచిత్రాలతో చందమామ సంక్షిప్త చరిత్ర, మనోహర మైన కొన్ని ముఖచిత్రాలు మొదలైన వాటితో నిజంగానే 'కలెక్టర్స్ ఎడిషన్' అని చెప్పతగిన విధంగా ఉన్నది.

పంజాబ్ జానపద కథ

# తండ్రిని ఉప్పులాగా ప్రేమించిన యువరాణి

ఒకానొకప్పుడు పరమ గర్విష్ఠి అయిన ఒక రాజుకు ఏడుగురు కుమార్తెలు ఉండేవారు. యుక్త వయస్కులయ్యాక వారికి వివాహాలు జరిపించాలని రాజు నిర్ణయించాడు. అంతకు ముందు తన కుమార్తెలు తనను ఎవరెవరు ఎంతగా ప్రేమిస్తున్నారో తెలుసుకోవాలన్న వింత కోరిక రాజుకు కలిగింది. వెంటనే వారిని పిలిపించి, ''మీరు నన్ను ఎలా ప్రేమిస్తున్నారో, ఒక్కొక్కరుగా చెప్పండి,'' అన్నాడు.

''నాన్నా, నేను నిన్ను తియ్యటి పంచదారను ప్రేమించినట్టు ప్రేమిస్తున్నాను,'' ''మధురమైన తేనెలా ప్రేమిస్తున్నాను,'' ''తియ్యటి మిఠాయిలా 'ప్రేమిస్తున్నాను,'' అంటూ ఆరుగురు పెద్ద కూతుళ్ళూ ఒకరితో ఒకరు పోటీపడి తమ మనోభావాలను వెలిబుచ్చారు.

ఆ మాటలు విని రాజు పరవసించిపోయాడు. ఆ తరవాత మౌనంగా ఉన్న చిన్న కుమార్తెను దగ్గరికి పిలిచి, ''నువ్వు నన్ను ఎంతగా ప్రేమిస్తున్నావో, చెప్పు తల్లీ,'' అన్నాడు ఆప్యాయంగా.

''నాన్నా, నేను మిమ్మల్ని చాలా గొప్పగా ఉప్పులాగా ప్రేమిస్తున్నాను,'' అన్నదామె మృదువైన కంఠస్వరంతో.

ఆ మాట విని రాజు దిగ్భ్రాంతి చెందాడు. తను ఎంతగానో ప్రేమించే చిన్న కూతురు ఇంత తేలిగ్గా తీసిపారేసిందేమిటి అనుకుంటూ, ''నిరుపేదలకుసైతం అందుబాటులో ఉండే ఉప్పుతో నన్ను పోలుస్తూ గొప్పగా ప్రేమిస్తున్నాను అంటావేమిటి? అదెలా సాధ్యం? నన్నెలా ప్రేమిస్తున్నావో చెప్పు,'' అని అడిగాడు రాజు ఆశ్చర్యమూ కోపమూ కలిసిన కంఠస్వరంతో.

అయితే, యువరాణి మళ్ళీ, 'నేను నిజమే చెబుతున్నాను నాన్నా! మిమ్మల్ని ఉప్పులాగానే ప్రేమిస్తున్నాను,'' అన్నది.





సూర్యుడు అస్తమించాడు. భార్య చెప్పిన కానుక మాట గుర్తురావడంతో ఏం చేయడమా అని కంగారు పడ్డాడు. కాలికి అడ్డంగా ఏదో మెత్తగా తగిలింది. అది పొడవుగా ఉండడంతో దారం అని భావించి దాన్నయినా తీసుకువెళ్ళి భార్యకు ఇద్దామని వంగితీసుకున్నాడు. ఇంటిని సమీపించగానే భార్యకు ఇచ్చాడు. దాన్ని దీపం వెలుగులో చూసిన యువరాణి, ''చచ్చిన పామును తెచ్చారేమిటి?'' అని అడిగింది.

ఆ మాటతో రాజు అమితాగ్రహానికి లోనయ్యాడు. పెద్ద కుమార్తెలారుగురికీ రాకుమారులతో వివాహాలు జరిపించాడు. ఏడవ కూతురిని అడవి సమీపంలో కట్టెలు కొట్టుకుని పొట్టపోసుకునే ఒక నిరుపేదవాడికి కట్టబెట్టాలని నిర్ణయించాడు. తండ్రి నిర్ణయానికి యువరాణి మౌనంగా రోదించింది. అయినా, తండ్రిని తను ఎంతగా ప్రేమిస్తున్నదీ తండ్రి అర్థంచేసుకునేలా చేయాలని నిశ్చయించింది. పెళ్ళయ్యాక భర్త వెంట అతడి గుడిసెకు బయలుదేరింది.

మరునాడు భర్త అడవికి బయలుదేరుతూండగా, ''మీరు రోజూ తిరిగి వచ్చేప్పుడు అడవినుంచి ఏదైనా కానుక తీసుకురావడానికి మరిచిపోకండి. అది మనలను త్వరలో సంపన్నులను చేస్తుంది,'' అన్నదామె.

భర్త అందుకు వెంటనే అంగీకరించాడు. ఆ రోజు అతడు అడవిలో కట్టెలు కొట్టడానికి బాగా ఆలస్యమైపోయింది. అతడు కట్టెల మోపుతో తిరుగు ప్రయాణమయ్యేసరికి

భయంకరమైన పొరబాటు జరిగిపోయినందుకు వాడు నొచ్చుకుని, ''ఇప్పుడు దీన్ని ఏం చేద్దాం?'' అని అడిగాడు భార్యను.

''గుడిసె పైకప్పు మీదికి విసిరివేయండి. ఉదయం లేచాక ఏం చేద్దామో ఆలోచిద్దాం,'' అన్నది ఆమె.

ఇక్కడ ఇలా ఉండగా, అక్కడ రాజధానిలో మహారాణి తన గారాల చిన్న కూతురికి జరిగిన అన్యాయానికి తల్లడిల్లి పోయింది. అయినా రాజుకు ఎదురు చెప్పలేక విచారంతో ఉద్యానవనంలో తిరుగుతూండగా, ఆమె మెడలోని వజ్రాలహారం జారి కింద పడిపోయింది. దుఃఖంలో మునిగి వుండడంవల్ల ఆమె దానిని గమనించలేదు. మౌనంగా రాజభవనానికి తిరిగివెళ్ళింది.

రాజోద్యానం మీద తిరుగుతూన్న ఒక డేగ మెరుస్తూన్న వజ్రాల హారాన్ని చూసింది. కిందికి వాలి దాన్ని ముక్కున కరుచుకుని అడవికేసి ఎగిరి వెళుతూ, కట్టెలు కొట్టేవాడి గుడిసె మీద

ఉన్న చచ్చిన పామును చూసింది. వెంటనే ఆ గుడిసె మీదవాలి, వజ్రాల హారాన్ని అక్కడపడేసి చచ్చిన పామును తన్నుకుని ఎగిరివెళ్ళింది.

అదే సమయంలో రాజభవనంలో మహారాణి వజ్రాల హారం కనిపించలేదని వెతకసాగారు. ఎలాగైనా దాన్ని మళ్ళీ తెప్పిస్తానని రాజు రాణిగారికి మాట ఇచ్చాడు. ఆ తరవాత రాణిగారి వజ్రాల హారం ఎక్కడైనా కనిపిస్తే తెచ్చి ఇచ్చినవారికి కోరిన బహుమతి ఇస్తానని రాజ్యం నాలుగు చెరగులా చాటింపు వేయమని భటులను ఆజ్ఞాపించాడు.

మరునాటి ఉదయం కట్టెలు కొట్టేవాడు ఇంటి కప్పు మీదికి విసిరిన చచ్చిన పామును తీసివేద్దామని నిచ్చెన వేసి ఇంటి కప్పు మీదికి ఎక్కాడు. అక్కడ మిలమిలా మెరుస్తూన్న హారాన్ని చూసి బిత్తరపోయి, ''యువరాణీ! ఇలా వచ్చి చూడు. ఇంటి కప్పు మీద ప్రకాశం! కప్పుకు నిప్పంటుకుందేమో చూడు!'' అంటూ కేకలు పెట్టసాగాడు.

యువరాణి వచ్చి చూసి నవ్వుతూ, ''అది నిప్పు కాదు. మా తల్లిగారి విలువైన వజ్రాల హారం! విధియే దాన్ని మన దగ్గరికి చేర్చింది. నన్ను మా తండ్రిగారు సరిగ్గా అర్థం చేసుకునేలా చేయడానికి మంచి అవకాశం దొరికింది!'' అన్నది.

ఆమె మాట ముగించే లోపలే దండోరా శబ్దం, ఆ తరవాత, ''అందరూ వినండహో! మహారాణిగారి అమూల్యమైన వజ్రాల హారం కనిపించడం లేదు. అది దొరికితే, తెచ్చి అప్పగించే వారికి కోరిన బహుమతి ఇవ్వబడుతుంది! ఇది రాజుగారి ప్రకటన! అందరూ వినండహో!'' అన్న భటుల చాటింపు వినిపించింది.

యువరాణి భర్త కేసి తిరిగి, ''నువ్వు వెంటనే వజ్రాలహారంతో వెళ్ళి దాన్ని మహారాజుకు అప్పగించు. నువ్వు ఎవరు అన్నది చెప్పవద్దు. ఎలాంటి బహుమతినీ కోరవద్దు. రేపు మధ్యాహ్నం మహారాజు వచ్చి మన ఇంట్లో భోజనం చెయ్యాలి. అదే ఆయన మీకిచ్చే బహుమతిగా చెప్పండి,'' అన్నది.

కట్టెలు కొట్టేవాడు అప్పటికప్పుడే బయలుదేరి వెళ్ళి, రాజును సందర్శించి వజ్రాల హారాన్ని అప్పగించి, ''మహారాజా! మహారాణిగారి వజ్రాల హారాన్ని విధి మా ఇంటి కప్పు మీదికి చేర్చింది,'' అన్నాడు.

హారాన్ని తీసి పరిశీలనగా చూసిన మహారాజు, ''మహారాణి పోగొట్టుకున్న వజ్రాల హారం ఇదే. తెచ్చి ఇచ్చినందుకు చాలా సంతోషం. ఏం బహుమతి కావాలో కోరుకో. ఇప్పుడే ఇస్తాను,'' అన్నాడు ఎంతో ఆనందంగా.





‘‘నేను కట్టెలు కొట్టుకుని బతికే ఒక నిరుపేదను. నాకు ఎలాంటి బహుమతీ వద్దు. మహారాజుగారు రేపు ఒంటరిగా మా ఇంటికి వచ్చి మాతో కలిసి భోజనం చేస్తే, అదే మహాభాగ్యంగా భావిస్తాను,’’ అన్నాడు కట్టెలు కొట్టేవాడు వినయంగా.

వాడి కోరిక విని రాజు ఒక్క క్షణం విస్మయం చెందాడు. అయినా ఆహ్వానాన్ని మన్నించక తప్పలేదు.

చెప్పిన ప్రకారం మరునాడు రాజు ఒంటరిగా కట్టెలు కొట్టే వాడి గుడిసెకు వెళ్ళాడు. అక్కడున్న యువరాణి, ముఖం కనిపించకుండా మేలి ముసుగు వేసుకుని ఎదురు వచ్చి రాజుకు నమస్కరించి మౌనంగా గుడిసె లోపలికి తీసుకువెళ్ళి కూర్చోబెట్టింది. ఆ తరవాత రకరకాల మధురమైన పిండివంటలను వడ్డించింది. మహారాజు వాటిని తిన్నాక మరి కొన్ని మధుర పదార్థాలు వడ్డించింది. వాటిని ముగించాక ఇంకా కొన్ని తీపి వంటకాలను వడ్డించ బోయింది. కాని రాజు అడ్డుకుంటూ, ‘‘క్షమించు తల్లీ, ఇక ఒక్క ముక్క కూడా తినలేను. జబ్బు చేస్తుంది. వెగటు పుట్టిస్తోంది. ఏదైనా ఉప్పగా ఉంటే ఇవ్వు తింటాను,’’ అన్నాడు.

వెంటనే యువరాణి మేలిముసుగును తొలగిస్తూ, ‘‘ఇప్పుడు తెలిసిందా నాన్నా ఉప్పు విలువ! తమరిని నేను ఉప్పులాగా ప్రేమిస్తున్నాను అని చెప్పినందుకు ఆరోజు ఆగ్రహించారు. ఇవాళ తీపి పదార్థాలు వద్దు, ఉప్పటి వంటకం కావాలంటున్నారు,’’ అన్నది.

రాజు అవాక్కయి పోయాడు. ఆనాటి తన చర్యకు సిగ్గు పడి తల పంకిస్తూ, ‘‘నన్ను క్షమించు తల్లీ! ఉప్పువిలువ తెలుసుకోలేక పోయాను. తక్కిన వారికన్నా నువ్వే నన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నావని ఇప్పుడు అర్థమయింది,’’ అన్నాడు.

యువరాణి తండ్రికి మళ్ళీ ఒకసారి నమస్కరించి ఆప్యాయతతో ఆయన చేతులు పట్టుకున్నది. కుమార్తె తెలివినీ, మంచితనాన్నీ గ్రహించిన రాజు ఆమెను రాజభవనానికి వెంటబెట్టుకుని వెళ్ళాడు. తన రాజ్యంలో కొంత భాగాన్ని ఆమెనూ ఆమె భర్తనూ పాలించుకోమని ఇచ్చాడు.

వాళ్ళు చక్కగా పరిపాలిస్తూ, మహారాజు ఉన్నంత వరకు ఆయన్ను ఎంతో అభిమానంగా చూసుకున్నారు.

# చందమామ కబుర్లు

## మిత్రులుగా మారిన శత్రువులు



ఇజ్రాయెల్ సైన్యంలో పనిచేస్తున్న గిలాడ్ స్కాల్ట్ (21) పాలస్తీనా తీవ్రవాదులు 'హమాస్'కు పట్టుబడి ఖైదీగా ఉన్నాడు. అతడు పదకొండేళ్ళ వయసులో ఐదవ గ్రేడు చదువుతున్నప్పుడు ఒక కథ రాశాడు. అది చిన్న చేపను మింగడానికి సిద్ధంగా వున్న సొర చేప కథ. తాము స్నేహితులుగా వుంటూ దాగుడు మూతలు ఆడుకుంటూ ఉంటే బావుంటుందని చిన్నచేప సొర చేపకు చెబుతుంది. అయితే, వాటి తల్లులు అది తగదని హెచ్చరించడంతో దూరంగా విడిపోతాయి. చాలా రోజుల తరవాత యాదృచ్ఛికంగా రెండూ కలుసుకున్నప్పుడు, ''నువ్వు నా శత్రువే, కానీ మిత్రులుగా మసలుకుందాం,'' అంటుంది సొర చేప. సొర చేపలూ, చేపలూ ఆ తరవాత ప్రశాంతంగా జీవించాయి. ఆ కథ గిలాడ్ స్కాల్ట్ టీచర్ దగ్గరే ఉండిపోయింది. ఇప్పుడామె దానిని తీసి గిలాడ్ తండ్రికి ఇవ్వడంతో ఆయన దానిని 29 పేజీల పుస్తకంగా ప్రచురించాడు.

## మ్యూజియంలో ఓడ

**30** మీ. పొడవు, మూడంతస్థుల మేడ అంతటి ఎత్తూ గల ఒక ఓడ ఇప్పుడు మ్యూజియంలో ఉంటోంది. దాదాపు 800 సం.లకు పూర్వం చైనాలోని గువాన్‌డాంగ్ ప్రాంతం సముద్రంలో మునిగి పోయి, ఇటీవల పైకి తీసేంతవరకు 30 మీ. లోతు జలగర్భంలో ఉండిపోయింది. చరిత్రకారులు దక్షిణ చీనా సముద్రం నం. 1 అని దానికి పేరు పెట్టారు. చైనాకు పాశ్చాత్య దేశాలతో జరిగిన వర్తక సంబంధాల మీద ఇది మరింత వెలుగును ప్రసరించగలదని వారు భావిస్తున్నారు. దానిని పైకి తీశాక, పగలగొట్టకుండా, సముద్రంలోని ఉష్ణోగ్రత, ఒత్తిడి వుండేలా నీళ్ళ మధ్య ఉంచాలని నిర్ణయించారు. ప్రస్తుతం 'స్ఫటిక భవనం'గా పిలువబడుతూన్న మ్యూజియంలో సందర్శకులు దానిని ట్యాంక్ కిటికీల గుండా చూడగలుగుతున్నారు. ఈ ఓడలో బంగారం, వెండితో పాటు వేలాది అమూల్యమైన కళాఖండాలు లభించాయని చెబుతారు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (30)

# అదృష్టం - ఓర్పు

ఇప్పుడు మనం చెప్పుకోబోయే ఉదంతం ఏ మహనీయుడికో, సుప్రసిద్ధ వ్యక్తికో సంబంధించినది కాదు. ఓర్పులేకపోవడంతో అమూల్య సంపదలకు దూరమైన ఒక పెద్దమనిషి గురించి!

అరేబియన్ నైట్స్‌లో ఆసక్తికరమైన ఒక యువకుడి కథ ఉంది. తమ పూర్వులు ధనికులే అయినప్పటికీ ఆ యువకుడు కెయిరోలోని ఒక నిరుపేద కుటుంబంలో పుట్టాడు. తల్లిదండ్రులను కూడా పోగొట్టుకోవడంతో, కాయకష్టంతో కాలం గడపసాగాడు. ఒకనాటి రాత్రి వాడికి కలలో, ''బాగ్దాద్‌వెళ్ళు. గుప్తనిధులు నీకు లభిస్తాయి,'' అన్న కంఠస్వరం వినిపించింది. మరునాడే వాడు కాలినడకన బాగ్దాద్ నగరానికి బయలుదేరాడు. ఒక రోజంతా ప్రయాణం చేసి రాత్రి ఒక మసీదులో బస చేశాడు. ఆ సమయంలో రక్షకభటుల నుంచి తప్పించుకున్న కొందరు దొంగలు అదే మసీదులోకి వెళ్ళి దాక్కున్నారు. కొంత సేపటికి రక్షక భటులకు పట్టుబడ్డారు. వాళ్ళతోపాటు అక్కడ పడుకున్న యువకుణ్ణి కూడా ఖైదు చేసి రక్షక భటులు, తమ అధికారి ఎదుట హాజరు పరిచారు. అయినా, విచారణలో ఆ యువకుడు నిరపరాధి అని గ్రహించిన అధికారి, ''నువ్వెందుకు బాగ్దాదుకు వెళుతున్నావు?'' అని అడిగాడు. యువకుడు తన కల గురించి చెప్పాడు. దాన్ని విన్న అధికారి నవ్వుతూ, ''గత కొన్ని సంవత్సరాలుగా నాకు, 'కెయిరోకు వెళ్ళి, ఇంటికి పశ్చిమ దిశలో ఈత చెట్టుకింది ఎండిపోయిన బావిలో ఉన్న గుప్తనిధులు తెచ్చుకో,' అన్న కల వస్తూనే ఉంది. కల కలే కదా. దాన్నసలు పట్టించుకోలేదు. నువ్వేమో ఒక్కసారి కల వచ్చిందని దాని కోసం బయలుదేరావా?'' అన్నాడు హేళనగా.



మరునాడు సాయంకాలానికి ఆ యువకుడు బాగ్దాద్‌ను సమీపించాడు. అతడి చర్యలను చూసి అనుమానించిన నగర కాపలా భటులు, అతణ్ణి బంధించి తమ అధికారి వద్దకు తీసుకువెళ్ళారు. ఆ యువకుడు మళ్ళీ తన కల గురించీ, తను వచ్చిన కార్యం గురించీ

అధికారికి వివరించాడు. అధికారి బిగ్గరగా నవ్వి, ''నాయనా, గత పదేళ్ళుగా కెయిరోకు వెళ్ళి మూడు ద్వారాలు మూయబడి నాలుగు మైపులా ద్వారాలు గల ఇంటిని కనుగొని, ఇంటికి పశ్చిమంగా ఉన్న ఈత చెట్టు కింది ఎండిపోయిన బావిలోని నిధులను తెచ్చుకోమని కలలో ఒక కంఠస్వరం వింటూనే ఉన్నాను. అయినా నేను దాన్ని పట్టించుకోలేదు. నువ్వేమో కలలో ఒక్కసారి విన్నందుకే ఇంత దూరం పనిగట్టుకుని వచ్చానంటున్నావు. ఇంటికి తిరిగి వెళ్ళు,'' అని సలహా ఇచ్చాడు.

''కృతజ్ఞతలు,'' అంటూ యువకుడు హుటాహుటిగా వెనుదిరిగాడు. ఆ అధికారి నిధినిక్షేపాలు ఉన్నవని వివరించిన ప్రదేశం అతనికి బాగా తెలిసినదే. ఎందుకంటే అదే అతడు ఉంటూన్న ఇల్లు. ఇంటికి నాలుగు ద్వారాలున్నా ఒకటి మాత్రమే తెరిచి ఉన్నది. పశ్చిమ దిశలోని ఈత చెట్టు, ఎండిపోయిన బావి మీద వాలినట్టు కనిపిస్తుంది. ఆ యువకుడు బావిలోకి దిగి నేలను తవ్వి నిధిని వెలుపలికి తీశాడు!

అంతకన్నా లక్షలరెట్లు ఎక్కువ గుప్త నిధులను కొద్దిలో చేజార్చుకున్నాడు ఇప్పుడు మనం చెప్పుకుంటూన్న పెద్దమనిషి!

ఒకప్పుడు హైదరాబాదులో నిజాం షాహీ పాలన జరిగేది. రాజకుటుంబానికి చెందిన పలువురు అక్కడికి తమ అదృష్టాన్ని వెతుక్కుంటూ రాసాగారు. అలాంటి వారిలో ఒకడు అలీహాఫెజ్. ఆయన కొంత భూమిని కొనాలనుకున్నాడు. ఒక వృద్ధుడాయనకు విశాలమైన భూమిని చౌకగా విక్రయిస్తూ, ''నాకు అవసాన దశ సమీపించలేదంటే, ఈ భూమిని అమ్మేవాణ్ణి కాదు. ఎందుకంటే మా పూర్వులు ఈ భూమి బంగారును ఇస్తుందని నమ్మారు.



దానికి ఇంకా సమయం రాలేదు. త్వరలో రానున్నది. అయినా, నేను పోయాక ఎన్ని సంపదలు వచ్చి ఏమిటి ప్రయోజనం?'' అన్నాడు.

అలీహాఫెజ్ ఆ భూమిని కొన్నాడే గాని, వెనువెంటనే లాభాలు సంపాదించాలని తొందరపడ్డాడు. కాస్త ఎక్కువ ధరకు అమ్మాలని నిర్ణయించాడు. సంగతి తెలిసిన వృద్ధుడు కనీసం ఒక సంవత్సరం వరకైనా ఓపిక పట్టమని సలహా ఇచ్చాడు. అయితే, అలీహాఫెజ్ వినకుండా భూమిని అమ్మేసి ఆ మొత్తాన్ని మరో పథకంలో పెట్టుబడిగా పెట్టాడు.

మరు సంవత్సరమే ఆ భూమి అడుగున వజ్రం బయట పడడంతో అది గోల్కొండ వజ్రాల గనిగా ప్రసిద్ధిగాంచింది. అలీహాఫెజ్ తల పెట్టిన నూతన పథకం దెబ్బతినడంతో ఆయన ఆర్థిక బాధలతో మరణించాడు. -(ఎం.డి)




## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-9

# నిగూఢ ప్రదేశంలో అద్భుత అన్వేషకుడు

అది పందొమ్మిదవ శతాబ్ద మధ్య కాలం. బ్రిటిష్ సామ్రాజ్యం త్వరిత గతిలో విస్తరిస్తున్న కాల ఘట్టం. భారత ఉపఖండ పటం స్పష్టంగా రూపొందించబడింది. అయితే భారతదేశ హిమాలయ పర్వత సరిహద్దులకు అనుకుని వున్న ప్రాంతాల భౌగోళిక, రాజకీయ, సైనిక విషయాలు వారికి ఏమాత్రం తెలియవు. ముఖ్యంగా ''భూప్రపంచపు పైకప్పు'' గా పేరు గాంచిన, నిగూఢ ప్రదేశమైన టిబెట్ గురించి అసలు తెలియదు. పద్ధెనిమిదవ శతాబ్దాంతంలో భారతదేశంలో ఏర్పాటైన గ్రేట్ ట్రిగ్నో మెట్రికల్ సర్వే సంస్థ రూపొందించిన దేశపటాలలో టిబెట్ పెద్దఖాళీ ప్రదేశం మాత్రమే. దాని రాజధాని లాసా కూడా కేవలం ఊహామాత్రమే. దానిని సర్వే చేసి ప్రపంచ పటంలోకి ఎక్కించడం ఎలాగా?

1852లో గ్రేట్ ట్రిగ్నోమెట్రికల్ సర్వే సంస్థలో చేరిన సాహస ప్రియుడైన యువ అధికారి థామస్ జార్జ్ మాంట్గోమెరీకి కాశ్మీరు చిత్రపటం తయారు చేసే బాధ్యత అప్పగించబడింది. ప్రతికూల వాతావరణం, అడుగడుగునా అపరిమితమైన అవరోధాలు, అపాయాలు. వీటికి తోడు 1857లో భగ్గుమన్న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం. ఇన్ని అవరోధాలను ఎదుర్కొంటూ మాంట్గోమెరీ బృందం కృతనిశ్చయంతో తన చర్యలను కొనసాగించింది. 1864 నాటికి హిమాలయాలకు దక్షిణంగా ఉన్న మహారాజా ఆఫ్ జమ్ము, కాశ్మీర్‌లను మ్యాపింగ్ చేసింది. 1400 చదరపుమైళ్ళ మంచు కొండలతో సహా 8000 మైళ్ళు కొలిచింది. ఆ సమయంలోనే మాంట్గోమెరీ టిబెట్‌కు వెళ్ళాలనుకున్నాడు. అయితే, దాదాపు మేఘాలతో దోబూచులాడే తమ రాజ్యంలోకి పరదేశీయులు ముఖ్యంగా యూరోపియన్లు అడుగు పెట్టరాదని టిబెట్



బహిష్కరించడంతో ముందుకు వెళ్ళలేక పోయాడు. అయితే, దాన్ని గురించే సదా సర్వవేళలా ఆలోచిస్తూ గడిపి విలక్షణమైన పరిష్కారాన్ని కనుగొన్నాడు.

సమర్థులైన స్థానికులను ఎంపిక చేసి వారికి సర్వే చేసే పద్ధతులలో శిక్షణనిచ్చి తగిన పరికరాలతో రహస్యంగా పంపినట్టయితే, పని సానుకూలమై భూగోళశాస్త్రానికి గొప్ప సేవచేసినట్టవుతుందని చెప్పాడు. పథకం ప్రమాద భరితమే అయినప్పటికీ, సాధ్యమేనని ఉన్నతాధికారులు అభిప్రాయపడ్డారు. సరిహద్దు ప్రాంతంలో అలాంటి సాహసానికిపూనుకోగల శక్తిసామర్థ్యాలు కలిగిన వారికోసం అన్వేషణ ప్రారంభించారు.

అతి ప్రయత్నం మీద కొందరిని సమీకరించి టిబెట్‌లో రహస్యంగా ప్రవేశించి, అక్కడి భౌగోళిక విషయాలను సేకరించుకుని తిరిగి రావడానికి రెండేళ్ళపాటు శిక్షణ నిచ్చారు. అలా శిక్షణ పొందిన 'పండిట్స్'లో ఉత్తరాంచల్ మిలామ్ గ్రామానికి చెందిన పాఠశాల ప్రధానోపాధ్యాయుడు నాయిన్‌సింగ్‌ముఖ్యుడు. ఆయన 1865 ప్రారంభంలో హంతకులైన బందిపోటు దొంగలు, దుర్గమ పర్వత మార్గాలతో ప్రతికూల వాతావరణం, ప్రతి కనుమవద్ద అప్రమత్తులైన సరిహద్దు కాపలాభటులు ఇలాంటి అవరోధాలన్నిటినీ దాటుకుని వెళ్ళడానికి బయలుదేరాడు.

సన్యాసి వేషంలో యాత్రకు వెళుతున్నట్టు టిబెట్ సరిహద్దు పట్టణం, క్యిరాంగ్‌ను చేరుకున్నాడు. అయితే, అధికారులు అతని మాటలు నమ్మకుండా ముందుకు వెళ్ళడానికి అనుమతించలేదు. దాంతో ఆయన నేపాల్‌కు తిరిగి వచ్చి, అక్కడి నుంచి లాసా మీదుగా మానస సరోవరానికి వెళ్ళే సన్యాసిలా వర్తకుల బిడారు వాహనంలో బయలుదేరాడు.

మంచునిండిన టిబెట్ దక్షిణ లోయలగుండా వర్తకుల వాహనాలు వెళుతూంటే, బౌద్ధసన్యాసిలా నాయిన్‌సింగ్ చేతిలో జపమాలతో, ఒక్కొక్క అడుగునూ లెక్కించుకుంటూ నడిచేవాడు. ఆయన వేసే దాదాపు రెండువేల అంగలు ఒక మైలుకు సమానంగా ఉండేవి. చేతిలోని వంద పూసల జపమాల సాయంతో తను నడిచిన దూరాన్ని మరింత స్పష్టంగా లెక్కగట్టగలిగేవాడు. ఆయన టిబెట్ నగరంలో దలైలామాకు తరవాతి స్థానం వాడైన పదకొండేళ్ళ పంచెన్ లామాను కలుసుకున్నాడు.

ఒకనాటి వేకువజామున హఠాత్తుగా బందిపోటు దొంగలు వర్తకుల బిడారుపైపడి దోపిడీ చేశారు. ఆ సమయంలో నాయిన్ సింగ్ గుర్రం మీద వాయువేగంతో దొంగల నుంచి తప్పించుకున్నాడు. ఇలా వాహనంలో, కాలినడకన, గుర్రం మీద, రకరకాలుగా ప్రయాణం చేసి ఆఖరికి లాసానగరం చేరుకో కలిగిగాడు.



కాపలాభటులు ఎవరైనా తనను అనుమానంతో చూస్తున్నారని తెలియగానే కళ్ళు మూసుకుని ధ్యానం నటించే వాడు. కోటులో దాచుకున్న ప్రార్థనా చక్రాన్ని వెలికి తీసి తిప్పుతూ, ''ఓం మణి పద్మేహం!'' అంటూ పవిత్ర మంత్రాన్ని జపించేవాడు. దాంతో అధికారులు ఆయన ప్రార్థనకు అంతరాయం కలిగించకూడదని వెళ్ళిపోయేవారు. ప్రార్థనా చక్రంలో మామూలుగా ప్రార్థనా శ్లోకాలు ఉండవలసిన చోట తను సేకరించిన సమాచారాన్ని అధికారుల కంట బడకుండా దాచేవాడు.

ఏకాంతంగా చేతిలో గిన్నె పట్టుకుని దూరంలోని కొండలను చూస్తూకూర్చునేవాడు. చూసేవాళ్ళు టీతాగుతున్నాడనుకునేవాళ్ళు. అయితే అతడు ఆ సమయాన్ని సాంకేతిక పరికరాల సాయంతో అక్కడినుంచి కొండల దూరాన్ని, సూర్య చంద్రుల, నక్షత్రాల స్థానాలను లెక్కగట్టడంలో నిమగ్నుడై ఉండేవాడు. అలా అతడు అక్షాంశ, రేఖాంశ రేఖలను గణించాడు. అతని ఊతకర్ర థర్మామీటర్ అయింది. దానిని టీనీళ్ళలో ముంచి బాయిలింగ్ పాయింట్ సాయంతో లాసా-సముద్ర మట్టానికి 11,700 అడుగుల ఎత్తులో ఉందని నిర్ణయించాడు. అది ఈనాటి లెక్కలకు కూడా దగ్గరగా ఉండడం అద్భుత విషయం. ఆయన సన్యాసివేషం దుస్తుల లోపల చిన్న కాంపాస్, ఒక క్రోనోమీటర్ వాచ్, మరికొన్ని ముఖ్య పరికరాలను దాచి ఉంచేవాడు.

అనుమతి లేకుండా లాసాలో అడుగు పెట్టిన ఒక యాత్రికుణ్ణి ప్రజలు తల తెగ నరకడం ఒకనాడు ఆయన కళ్ళారా చూశాడు. అక్కడి నుంచి త్వరగా బయటపడాలని యార్లాంగ్ త్యాంగ్‌పో నదీ తీరంగుండా ప్రయాణమైన మరొక వర్తకుల బిడారుతో తిరుగు ప్రయాణమయ్యాడు. రెండు నెలల ప్రయాణంతో లామా వేషంలోని నాయిన్ సింగ్ 1000 కి.మీ. నదీ ప్రవాహాన్ని కొలిచాడు. ఆ నది భారతదేశంలోని బ్రహ్మపుత్ర ఒకటే ఏమోనన్న అనుమానంతో-యార్లాంగ్‌లో ఆనవాళ్ళతో చిన్న చిన్న దుంగలను పడవేశాడు. అవి ఆ తరవాత అస్సాంలో కనుగొనబడడంతో ఒకే చోటి నుంచే రెండు నదులూ ఆవిర్భవిస్తున్న విషయం రుజువయింది!

సరిహద్దు కాపలాభటులే కాకుండా తోటి ప్రయాణీకులైన వర్తకులుసైతం తనను అనుమానించడం నాయిన్‌సింగ్ గమనించాడు. ప్రలోభానికిలోనై ఏ క్షణంలోనైనా వాళ్ళు తనను భటులకు అప్పగించవచ్చునన్న సందేహం ఏర్పడడంతో-అర్ధరాత్రి సమయంలో వారి నుంచి దూరమై ఒకటిన్నర సంవత్సరం ఒంటరిగా



ప్రయాణం చేసి ఇండియా చేరుకున్నాడు.

మార్గమధ్యంలో పెద్ద బంగారు బుద్ధవిగ్రహాలను గమనించడంతో టిబెట్‌లో బంగారు గనులు ఉండవచ్చని ఊహించాడు. ఆయన 1867లో మరో సాహస యాత్ర చేసి ధోక్-జాలుంగ్ బంగారు గనులను కనుగొన్నాడు. లామా వేషంలో ఉన్నప్పటికీ గనుల స్థానిక తవ్వకాల అధికారి నాయిన్‌సింగ్‌ను అనుమానంతో చూశాడు. వెంటనే నాయిన్ సింగ్ తన వద్ద ఉన్న అందమైన పగడాల ఆభరణాన్ని తీసుకుని, ప్రార్థనా చక్రాన్ని తిప్పుకుంటూ వెళ్ళి, ఆభరణాన్ని అధికారి భార్య చేతికిచ్చాడు మందహాసంతో. దాంతో పరమానందం చెందిన అధికారి తన వద్ద వున్న వెయ్యికిలోల బంగారాన్ని ఆయనకు చూపాడు. అలా గండం గడిచింది.

1874లో బౌద్ధ సన్యాసిలా కొందరితో కలిసి, గొర్రెల మందను తోలుకుని మరోసారి నాయిన్ సింగ్ లాసాగుండా చైనా రాజధాని పీకింగ్(బీజింగ్)కు మార్గం కనుగొనాలని బయలుదేరాడు. అయితే, ఒక సంవత్సరం తరవాత వాళ్ళు లాసా చేరేసరికి-బ్రిటిష్ గూఢచారులు వచ్చి ఉన్నట్టు అక్కడ వదంతులు వ్యాపించాయి. అపాయాన్ని శంకించిన నాయిన్ సింగ్, అంతవరకు సేకరించిన వివరాలను, మార్గాల సర్వే సమాచారాన్ని ఇద్దరు సహచరులకు ఇచ్చి ఇండియాకు పంపాడు. ఆ తరవాత తమ వద్ద ఉన్న పనికిరాని వస్తువులను ఒక సంచీలో వేసి, తాము బసచేసిన సత్రం యజమానితో, "మేము నగరానికి ఉత్తరంలోని పవిత్రస్థలాన్ని దర్శించిరావాలి. తిరిగి వచ్చేంత వరకు వీటిని భద్రంగా ఉంచు. అద్దె ఇస్తాము," అని చెప్పాడు. సత్రం యజమాని సమ్మతించాడు. నాయిన్ సింగ్ తన అనుచరులతో కొంత దూరం ఉత్తరంవైపు వెళ్ళి, చీకటి పడగానే దక్షిణంగా తిరిగి భటుల కన్నుగప్పి సురక్షితంగా కొన్నాళ్ళకు స్వదేశం చేరుకున్నాడు.

బ్రిటిష్ ప్రభుత్వం నాయిన్‌సింగ్‌ను సుప్రసిద్ధ అన్వేషకులు లివింగ్‌స్టోన్, గ్రాంట్‌లాంటివాడని కొనియాడింది. మరే యూరోపియన్ కూడా వెళ్ళలేని ఆసియాలోని కొన్ని నిగూఢ ప్రదేశాలకు వెళ్ళి ఆ ప్రాంతాల పట్ల సరైనసమాచారాన్ని సేకరించిన విశ్వాసపాత్రుడు, సాహసశీలి అని ప్రశంసిస్తూ, రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ ఆయన్ను బంగారు పతకంతో సత్కరించింది.





ప్రస్తుతం చెన్నయ్‌లో ఉంటూన్న సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్ నూజివీడులో జన్మించారు. ఆమె తొలి కథ ప్రచురించబడిన ఆనందవాణి పత్రికలోనే ఆమె నవల 'చంపకం-చెదపురుగులు' కూడా సీరియల్‌గా వచ్చింది. 1952 నుంచి 45 సం.ల పాటు నిరంతరాయంగా ఆంధ్రప్రభ వారపత్రికలో 'ప్రమదావనం' శీర్షికను నిర్వహించారు. ఆమె రచనలు హిందీ, గుజరాతీ, ఒరియా, కన్నడ భాషలలోకి అనువదించబడ్డాయి. ఆమె దాదాపు 300 ఆంగ్ల నవలలను తెలుగులోకి అనువదించారు. 1992లో ఆమె భారతీయ భాషా పరిషత్ అవార్డ్ (కొల్‌కతా)తో సత్కరించబడ్డారు. 1987లో ఆంధ్రరాష్ట్ర సాహిత్య అకాడెమీ అవార్డునూ, 1993లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డునూ అందుకున్నారు.

# చిన్నప్పుడు విన్న కథ

అందరి పిల్లల్లాగే నేనూ నక్కబావ-కాకి, పేదరాసి పెద్దమ్మ-వంటి కథలు వినివుండ వచ్చు. కాని, అవి నాకు అంతగా జ్ఞాపకం లేవు. ఏడెనిమిదేళ్ళ వయసప్పుడు, వెన్నెట్లో చాప పరచుకుని మా బావగారి చేత చాలా కథలు చెప్పించుకుని వినేదాన్ని. అందులో ఒకటి నాకు ఈనాటికీ కళ్ళకు కట్టినట్లుగానే వుంటుంది. ఆయన చెప్పే విధం, చెవుల్లో ఇంకా వినపడుతూనే వుంటుంది.

మా బావగారు అప్పటికి నైజామ్ రాష్ట్రంలో విద్యాశాఖలో వుండేవారు. ట్రెయినింగ్ కాలేజ్ ప్రిన్సిపాల్‌గా రిటైర్ అయ్యాక కూడా, నేను రచయిత్రిగా స్థిరపడినా కూడా, నాకు ఎన్నెన్నో కథలు చెపుతూనే వుండేవారు. అసలు నాలో ఒక రచయిత్రికి, నా ఊహలకి రెక్కలు తొడిగిన వ్యక్తి మా బావగారు. అంత గొప్పగా కథలు చెప్పి, ఆకాశంలో ఎగిరేలా చేసేవారు. ఆయన చెప్పిన అనేక కథల్లో 'కోడిగుడ్డంత ధాన్యపుగింజ' అన్న కథ ఈనాటికీ నన్ను తారాజువ్వలాగా ఊహాలోకాల్లోకి తీసుకుని వెడుతూవుంటుంది-అది నాకు చాలా ఇష్టమైన కథ.

ఇది జానపద కథ అనుకుంటా. ఒక సాయంత్రం వేళ చిన్నపిల్లలు ఆటలాడుకుంటూండగా, వాళ్ళకి ముళ్ళ పొదల మధ్యన, ఒక కోడిగుడ్డు కనబడుతుంది. పిల్లలు గదా సహజమైన కుతూహలంతో ఆ గుడ్డును చేతుల్లోకి తీసుకుని, పరిశీలనగా చూస్తారు. ఎవరికీ అది ఏమిటో, గుడ్డు అవునో కాదో అంతు పట్టదు.

ఆ దారినే పోతూన్న ఒక పెద్దమనిషి ఆ పిల్లలకి ఒక అణాయిచ్చి, ఆ గుడ్డును కొనుక్కుంటాడు. ఆయన కూడా ఆ గుడ్డును పరీక్షగా చూస్తాడు. ఎంత చూసినా అది ఏ పక్షి గుడ్డో కనిపెట్టలేకపోతాడు. 'ఈ గుడ్డును తీసుకెళ్ళి రాజుగారికి ఇస్తే ఆయన తగిన బహుమతి ఇస్తాడు' అన్న అశతో, జాగ్రత్తగా తీసుకెళ్ళి, ఆ గుడ్డుని రాజుగారికి ఇస్తాడు. రాజుగారు ఆ పెద్దమనిషికి తగినంత బహుమానం ఇచ్చి ఇది ఏ పక్షి గుడ్డు, అని కాసేపు పరిశీలించి, తెలుసుకోలేక, రాజదర్బారులోని సభికులను ఇది ఏ పక్షి గుడ్డో వివరించమని కోరుతాడు. వారు ఆ గుడ్డును చేతుల్లో పట్టుకుని, ఇటూ అటూ తిప్పిచూస్తారు. వారికీ అది ఏమిటో అంతుబట్టదు.

ఆ గుడ్డును అలా ఒక కిటికీలో వుంచగా ఒకకోడి, గుడ్డును ముక్కుతో పొడిచి చూస్తుంది. అది పగలదు. అది గుడ్డు కాదని తెలిసిపోతుంది. ఈ సమస్యను ఎవరు విడగొడతారు? సభాసదుల సలహాతో రాజుగారు పండితులను, మేధావులను అందరినీ పిలిపించి, "ఇది ఏం గుడ్డు? అసలు గుడ్డు అవునా కాదా? తేల్చి చెప్పండి," అని ప్రశ్నిస్తాడు. వారంతా దాన్ని పరీక్షించి, "ఇది మాకు సంబంధించిన వ్యవహారం కాదు. దీనిని గురించి నేలను నమ్ముకున్న వాళ్ళే చెప్పగలరు. మీరు దేశంలోని రైతులను పిలిపించి వారిని పరిశీలించి చెప్పమని అడగండి," అని సలహా ఇస్తారు.

రాజుగారు రాజ్యంలో చాటింపు వేయిస్తారు. "వ్యవసాయంలో బాగా నైపుణ్యం గల రైతులు ఎవరైనావచ్చి ఈ చిక్కుముడిని విప్పగలరా?" అని.

ఎవరూ రారు.

ఈలోగా రాజభటులు రాజ్యం అంతా గాలించి గాలించి, బాగా పంటలు పండే భూములను వెతికి, అక్కడికి వెళ్ళి–అక్కడున్న ఒక రైతును వెతికి తీసుకు వస్తారు. ఈ రైతునడవలేడు. రెండు చేతులకింద కర్రలు ఊతంగా పెట్టుకువచ్చిన ముసలివాడు. ఈ ముసలి రైతుకు చెవులు వినిపించవు–కళ్ళు కూడా కనిపించవు. అతడు రాజుగారి దగ్గరున్న కోడిగుడ్డంత గింజని–తడిమి తడిమి చూసి, "మా పూర్వీకుల నుంచి ఇటువంటి





కోడిగుడ్డంతేసి పెద్ద గింజలున్న మొక్కజొన్న కండెలు, పండేవని విన్నాను. అయితే ఇలాంటిదాన్ని నేనెప్పుడూ పండించలేదు. కాని మా నాన్న చెపుతూండే వాడు, ఇంత పెద్ద ధాన్యాన్ని తన కాలంలో పండించేవారని'', అంటూ వణికే కంఠంతో నీరసంగా ఆ రైతు చెప్తాడు. రాజుగారు ఈ సంగతి విని నిరాశ చెందలేదు; పట్టుదల వదలనూ లేదు.

''ఈతని తండ్రిని వెతికి తీసుకురండి,'' అని భటులను పంపుతాడు.

ఈ రెండో రైతుకు ఒక కాలుకుంటి. కర్ర ఆసరాతో కుంటుతూ నడుచుకు వస్తాడు. కళ్ళు కనిపిస్తున్నాయిగాని, చెవులు వినిపించవు. మనిషి-మరీ అంతబలహీనంగా వుండడు. రాజుగారు కోడి గుడ్డంత ధాన్యపు గింజను చూపించి, ''ఇది నువ్వెప్పుడైనా చూశావా? మీ పొలంలో పండిందా?'' అని ప్రశ్నిస్తే, ''లేదండి, నేను చూడలేదు; పండించనూ లేదు. ఇంత పెద్ద ధాన్యపు గింజ గురించి మా నాన్న చెపుతూండేవాడు. మా నాన్నని అడగండి,'' అంటూ సమాధానం చెప్పాడు.

ఈ మూడో తాతని అంటే రెండు కర్రలు చేతులకింద ఊతంగా వచ్చిన వాడి తాతని, వెతికి తీసుకొస్తారు రాజభటులు. ఈ తాత హాయిగా నడిచి వస్తాడు. రెండు కాళ్ళూ శుభ్రంగా వున్నాయి. మనిషి దృఢంగా వున్నాడు. చెవులు వినిపిస్తున్నాయి. కళ్ళు కనిపిస్తున్నాయి.

ఆ తాత చేతిలో కోడిగుడ్డంత గింజను పెట్టి రాజుగారు అడుగుతారు:

''తాతా, ఇల్లాంటి ధాన్యపు గింజను ఎక్కడయినా చూశావా?''

గింజను అరిచేతితో పట్టుకుని, ''ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి ఇంత అందమైన ధాన్యం చూశాను! నా చిన్నప్పుడు మా పొలంలో ఇలాంటివే పండించేవాళ్ళం,'' ఆశ్చర్యం, ఆనందం మిళితమై తాత సంబరంగా అంటాడు.

''నువ్వు మీ పొలంలో పండించేవాడివా? ఇంత పెద్ద గింజను?''

''అవును, మా పొలంలో కోడిగుడ్డంత పెద్ద గింజలు పండేవి. ఒక్కో గింజకు గుప్పెడు పిండి వచ్చేది. అందరూ కడుపునిండా తృప్తిగా తినేవాళ్ళం.''

రాజుగారు ఆశ్చర్యంతో, ''తాతా, నీ పొలం ఎక్కడుంది?'' అని అడిగారు.

## చందమామ క్విజ్-3 (ఏప్రిల్ 2008) సమాధానాలు

1. ఉత్తరప్రదేశ్ 2. మణిపూర్ 3. కొల్‌కతా. అక్కడే పశ్చిమ బెంగాల్ శాసనసభ సమావేశాలు జరుగుతాయి 4. సిక్కిం 5. కళింగ 6. పుదుచ్చేరి 7. ఉత్తరాఖండ్ 8. అస్సాం-బ్రహ్మపుత్ర 9. పంజాబ్-హర్యానా 10. ఉత్తరప్రదేశ్ 11. హర్యానా 12. జమ్మూ-కాశ్మీర్

''అది ఏ ఒక్కరి పొలమూ కాదు. అందరిదీను. భగవంతుడు ఈ భూమిని సాగుచేసి పంట పండించుకోమని మనుషులందరికీ ఇచ్చాడు,'' తాత బదులు చెప్పాడు.

''పండించినది మీకు సరిపోయేదా? మిగిలిన ధాన్యం ఏం చేసేవాడివి? అమ్మేవాడివా?''

''అమ్మటం, కొనటం మాకు తెలియదు. అసలు మా కాలంలో డబ్బు అన్న మాట ఎరగం. అందరం కష్టపడేవాళ్ళం. పండించిన ఫలసాయం అందరం పంచుకుని కడుపునిండా తినేవాళ్ళం. మా చిన్నప్పుడు ధాన్యపు గింజ ఇంత బలంగానూ పెద్దదిగానూవుండేది.''

''మరి ఇప్పుడు అలా లేదేం?'' రాజుగారు ఆశ్చర్యంగా అడిగారు.

''మనిషికి డబ్బాశ పెరిగింది. ఒకడు కష్టపడితే మరొకడు కొనుక్కుంటున్నాడు. ఈ డబ్బు అనేది వచ్చి పంటలు, గింజలు క్రమంగా క్షీణించిపోతున్నాయి. తిండి గింజలు చిన్న చిన్నవయి పోతున్నాయి,'' అని తాత జవాబు ఇచ్చాడు.

''తాతా, నాకో సందేహం. నువ్వింత



హాయిగా వున్నావు. కాళ్ళూ, కళ్ళూ, చెవులూ అన్నీ వుండి ఆరోగ్యం గావున్నావు. నీ కొడుక్కి ఒక కాలు లేదు. మనవడికి రెండు కాళ్ళూ లేవు. నీకంటే ముసలివాళ్ళుగా కనిపిస్తున్నారు. కారణం ఏమిటి?'' అని అడిగారు రాజుగారు.

''మా రోజుల్లో మేము కష్టపడి తిండిగింజలు పండించేవాళ్ళం. సమానంగా కష్టపడి, అందరం సమానంగా తినేవాళ్ళం. ఇప్పుడు కష్టపడేవాళ్ళు తగ్గిపోయి, కూచుని తినేవాళ్ళు ఎక్కువయి పోయారు. నా కొడుకూ మనవడూ ఆ కోవలో వాళ్ళే. ఈ భూమిని కాయకష్టంతో దున్ని, పుడమితల్లి ఇచ్చే పంటను సమానంగా అనుభవించమని మనకి ఇచ్చాడు దేవుడు. మనం ఆ విధంగా చెయ్యడం లేదు. అందుకనే ధాన్యం గింజలు బక్కచిక్కిన వయ్యాయి. ఇది అంతా ఆ దేవుడి లీల,'' అని తాత గంభీరంగా బదులు చెప్పాడు.

ఈ కథ ఎన్నెన్నో ఏళ్ళక్రితం మా బావగారు చెప్పగా విన్నాను. అది టాల్‌స్టాయ్ కథ అని అప్పట్లో నాకు తెలియదు. సూర్యచంద్రుల కంటపడనిది కూడా కథకుడు చూడగలడు. అటువంటి గొప్ప దార్శనికుడు టాల్‌స్టాయ్.

–మాలతీ చందూర్

## మన దేశం క్విజ్

ఈ నెల క్విజ్ లో ప్రాచీన భారతదేశం గురించి కొన్ని విషయాలు గుర్తు చేసుకుందాం.



1. బాబర్ చక్రవర్తి ఆస్థానంలోని ఒక పాలకుడు మహాభారతాన్ని బెంగాలీ భాషలోకి అనువదించాడు. ఆయన ఎవరు?



2. ఆ సంగీత విద్వాంసుణ్ణి కర్ణాటక సంగీత పితామహుడిగా కీర్తిస్తారు. 15వ శతాబ్దంలో జీవించిన ఆయన పేరేమిటి?



3. వ్యాయామాలను రోగనివారకాలుగా యోగ శాస్త్రంలోని ఏ విభాగం ఉద్ఘాటిస్తుంది?



4. కనిష్కుడి ఆస్థానంలోని ఒక నాటకకర్త బుద్ధుడి జీవిత చరిత్రను నాటకంగా రచించాడు. ఆయన ఎవరు? ఆయన రచించిన నాటకం పేరేమిటి?



5. పంచసిద్ధాంతిక అన్నది ఆరవ శతాబ్దంలో రచింపబడ్డ ఖగోళ శాస్త్ర గ్రంథం. దానిని ఎవరు రచించారు?

(సమాధానాలు 74వ పేజీలో)

# చందమామ క్విజ్ - 5

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

ఈ నెల క్విజ్ మన ఆర్థిక రంగానికి సంబంధించినది

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు ( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద **చందమామ క్విజ్ – 5** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఆగస్ట్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. సాధారణంగా కేంద్ర బడ్జెట్ పార్లమెంటుకు ఎప్పుడు సమర్పించబడుతుంది?
2. మన దేశ జాతీయ ఆదాయ వివరాల గణాంకాలను మొట్టమొదట తయారు చేసినవారెవరు?
3. ''నాకు తెలిసిందల్లా ఒకే కల్చర్. అదే అగ్రికల్చర్'' (వ్యవసాయం) అని చెప్పిన వారెవరు?
4. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఎప్పుడు స్థాపించబడింది? అది ఎప్పుడు జాతీయం చేయబడింది?
5. భారత ప్రభుత్వ బ్యాంక్ ఏది? దాని మొదటి పేరేమిటి?
6. భారత వాణిజ్యానికి ముంబైలోని దలాల్ వీధి మారుపేరు. దాని పేరులోని ప్రాముఖ్యత ఏమిటి?
7. ప్లానింగ్ కమిషన్ ఛైర్మన్ పదవిని ఎవరు నిర్వహిస్తారు?



# ఒలింపిక్ ఫ్లేమ్ &టార్చ్



ఏప్రిల్ 17వ తేదీ ఒలింపిక్ టార్చ్ న్యూఢిల్లీకి చేరింది. రాష్ట్రపతి భవన్ నుంచి ఇండియాగేట్ వరకు 2.3 కి.మీ. దూరం దాన్ని ఊరేగింపుగా తీసుకువెళ్ళారు. దాదాపు డెబ్భై మంది క్రీడాకారులు, ప్రముఖులు రిలేలో పాల్గొన్నారు.

అంతకు ముందు బీజింగ్ ఒలింపిక్ ఆర్గనైజింగ్ కమిటీ వైస్-ఛైర్మన్ జియాంగ్ యూ లాంథర్‌లో భద్రంగా తీసుకువచ్చిన ఒలింపిక్ ఫ్లేమ్‌ను ఢిల్లీ ముఖ్యమంత్రి శ్రీమతి షీలా దీక్షిత్‌కు అందించారు. ఆమె టార్చ్‌ని వెలిగించి ఇండియన్ ఒలింపిక్ అసోసియేషన్ ప్రెసిడెంట్ సురేష్ కల్మాడికి అందించారు. ఒలింపియన్ ఫ్లైయింగ్ సిక్ఖ్ మిల్ఖా సింగ్‌తో రిలే ఆరంభమయింది. రిలే చివర మన టెన్నిస్ ఛాంపియన్లు లియాండర్ పయజ్, మహేష్ భూపతి సంయుక్తంగా ఇండియాగేట్ వద్ద ఏర్పాటు చేసిన కొప్పెరను జ్యోతి ప్రజ్వలనం చేశారు. ఆ తరవాత టార్చ్ థాయిలాండ్ కేసి తన ప్రయాణాన్ని కొనసాగించింది. ఈయేడు ఒలింపిక్ క్రీడలు ప్రారంభమయ్యేప్పుడు అది బీజింగ్ చేరుకునేసరికి ఐదు ఖండాల గుండా 21 రాజధానుల మీదుగా 137,000 కి.మీ. (85,000మైళ్ళు) ప్రయాణం చేస్తుంది.

ఒలింపిక్ ఫ్లేమ్ పుట్టుక ప్రాచీన కీడల (క్రీ.పూ 776-క్రీ.శ. 393) కాలంలోనే జరిగింది. గ్రీసు ఒలింపియాలోని హీరా దేవాలయంలోని అర్చకుల ఆధ్వర్యంలో సూర్య కిరణాల నుంచి పవిత్ర కార్యక్రమంలో జ్యోతిని వెలిగించేవారు. దాదాపు రెండువేల ఏడువందల సంవత్సరాల అనంతరం గత మార్చ్ 24వ తేదీ దీన్ని మళ్ళీ జరిపి చూపారు. గ్రీకు నటి మరియా నేఫ్లియాటో పూజారుల పాత్ర నిర్వహించి హీరా దేవాలయం ముందు టార్చ్‌ని వెలిగించి గ్రీకు క్రీడాకారుడు నికోలాయిడిస్‌కు అందించింది (ఫోటో చూడండి). ఆయన 2004 ఏథెన్స్ గేమ్స్‌లో రజత పతకం సాధించాడు. గ్రీసులో 6 రోజుల రిలే తరవాత 2008లో క్రీడలకు ఆతిథ్యమిచ్చే దేశం చైనాకు తీసుకుపోబడింది.



ఆధునిక క్రీడలలో 1928లో అమ్‌స్టర్‌డాం క్రీడలలో జ్యోతి వెలిగించబడింది. 1936లో మొదటి టార్చ్ రిలే 1936 బెర్లిన్ గేమ్స్‌లో నిర్వహించబడింది. ఒలింపియా నుంచి బెర్లిన్ వరకు సాగిన రిలేలో దాదాపు 3000 మంది పాల్గొన్నారు. టార్చ్ స్టెయిన్ లెస్ స్టీల్‌తో తయారు చేయబడింది.



# ఎవరు గొప్ప?

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు కాశీరాజు కుమారుడై జన్మించాడు. ఆయన తక్షశిలకు వెళ్ళి పదహారేళ్ళు నిండే లోపుగానే సమస్త శాస్త్రపురాణాలన్నీ చదివేశాడు. కొన్నేళ్ళకు తండ్రి మరణించడంతో ఆయన కాశీ దేశానికి రాజై, ఏ మాత్రమూ ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేయసాగాడు.

ఆయన పరిపాలనలో ప్రజలు ఎలాంటి బాధలూ, అన్యాయాలూ, అక్రమాలూ లేకుండా సుఖజీవనం గడుపుతూ రావటం చేత, న్యాయస్థానం పూర్తిగా పనిలేకుండా పాడుబెట్టినట్టయిపోయింది. ఎన్ని ఏళ్ళు గడిచినా రాజాస్థానానికి ఒక్కడూ రాడు, ఫిర్యాదు చెయ్యడు. ప్రజలలో ఎట్టి ఆందోళనా లేకపోవటంచేత రాజుకు తన వల్ల ఏ లోపాలు జరుగుతున్నదీ, తనను గురించి ప్రజలేమనుకుంటున్నదీ తెలియ లేదు. కనీసం వ్యాజ్యాల మీద ఆస్థానానికి వచ్చిపోయే వారున్నా వారి ద్వారా రాజు తన లోపాలు తెలుసుకోవటానికి వీలుండేది; కాని, ఆస్థానంకేసి తొంగి చూసే వాళ్ళే కరువయ్యారు.

అందుచేత ఒకనాడు రాజు బాగా ఆలోచించి తన రథం ఎక్కి కాశీ నగరమంతా తిరుగుతూ, కనిపించినవారినల్లా, ''నా పరిపాలనలో మీకేం లోపాలు కనిపించాయి?'' అని అడగసాగాడు.

కాని ఎంతమంది నడిగినా ప్రతి ఒక్కరూ, ''మేము తమ పరిపాలనలో ఏ కొరతా లేకుండా చాలా సుఖంగా ఉన్నాం, మహారాజా! మాకు ఎలాంటి లోపమూ కనిపించటం లేదు!'' అని చెబుతూ వచ్చారు.

అప్పటికీ రాజుకు తృప్తి కలగలేదు. ఆయన తన రాజలాంఛనాలన్నీ తీసివేసి, సామాన్యుడి

జాతక కథ

వేషంలో రథం మీద నగరం దాటి పల్లెపట్టుల వెంట ప్రయాణం చేస్తూ, తనను గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో వినటానికి పూనుకున్నాడు. ఆయన ఎన్ని గ్రామాలకు వెళ్ళినా, కాశీరాజు గురించి పల్లెత్తు ఆక్షేపణ ఎక్కడా వినపడలేదు.

చివరకు రథం రాజ్యపు సరిహద్దు చేరుకుని సరిహద్దు బాట వెంబడి తిరిగి రాజధానికి వస్తున్నది.

ఆ సమయంలో కాశీ రాజెక్కిన రథానికి మరొక రథం ఎదురు వచ్చింది. రెండు రథాలూ ఒకదాన్నొకటి తప్పుకుపోయే అవకాశం లేదు. ఎందుకంటే, అది ఒక రథం మాత్రమే వెళ్ళగలిగినంత ఇరుకు బాట. దానికి రెండు పక్కలా ఎత్తయిన గట్లున్నాయి.

రెండు రథాలూ ఒకదానికొకటి అంత దూరంలో ఆగాయి. ''మేము ముందుకు వెళ్ళాలి! మెల్లగా నీ రథాన్ని వెనక్కు తిప్పుకో!'' అన్నాడు కాశీరాజు సారథి.

''నన్ను రథం తిప్పమనటానికి నీకేమి అధికారం ఉన్నది? నువ్వే నీ రథాన్ని వెనక్కు తిప్పు!'' అన్నాడు రెండవ రథంలోని సారథి.

ఇద్దరు సారథులూ కోపావేశంతో వాదులాటకు దిగారు.

''ఈ రథంలో ఉన్నదెవరో తెలుసా? కాశీ రాజుగారు!'' అన్నాడు కాశీరాజు సారథి పట్టరాని కోపంతో.

''ఈ రథంలో ఉన్నది కోసల రాజుగారు!'' అన్నాడు రెండవరథం తోలేవాడు ఏమాత్రం తొణక్కుండా.



కోసల రాజ్యం కూడా కాశీరాజ్యం అంత పెద్దదే. వయసులోనూ, చదువులోనూ కోసల రాజైన మల్లికుడు కాశీరాజుకు సరిసమానుడు. ఆయన కూడా తన దేశమంతా తిరిగి, ప్రజల అభిప్రాయం విని, తనవల్ల తప్పులున్నట్టయితే సరిచేసుకునే ఉద్దేశంతో మారువేషంలో బయలుదేరినవాడే.

''మీ రాజుగారిలోని ఆధిక్యత ఏమిటి?'' అని అడిగాడు కాశీరాజు సారథి.

దానికి కోసలరాజు సారథి వెంటనే ఈ విధంగా జవాబు చెప్పాడు:

దళహం దళహస్య ఖిపతిమల్లికో
ముదునా ముదుల,
సాధుంపి సాధునా జేతి అసాధుంపి
అసాధునా,
ఏతాదిసో అయం రాజా ముగ్గా
ఉయ్యాహి సారథి ||

[మా మల్లిక మహారాజుగారు దుష్టులకు దుష్టుడు, సజ్జనులకు సజ్జనుడు. మంచితనాన్ని మంచితనంతో బహూకరిస్తాడు. దుర్మార్గాల్ని దుర్మార్గంతో నిగ్రహిస్తాడు.]

ఇది వింటూనే కాశీరాజు సారథి ఈ విధంగా జవాబిచ్చాడు:

అక్కోధేన జినే కోధం అసాధుం
సాధునా జినే,
జినే కదరియం దానేన సచ్చేన అలివాదినం
ఏతాదిసో అయం రాజా మగ్గా
ఉయ్యాహిసారథి ||

[మా మహారాజు ఆగ్రహాన్ని శాంతంతో జయిస్తాడు; దుర్మార్గాన్ని సాధుత్వంతో లొంగదీస్తాడు; బహుమానాలతో లోభులను ఓడిస్తాడు; అబద్ధాలకు ప్రతిఫలంగా సత్యాన్ని ఇస్తాడు.]

కాశీరాజు రథాన్ని తోలే సారథి అన్న ఈ మాటలు వినగానే కోసలరాజు మల్లికుడు తన రథం నుంచి దిగి వచ్చి, కాశీరాజుకు ప్రణమిల్లి, ''పుణ్యాత్మా, నా లోపం నాకు తెలిసి వచ్చింది. దానిని సరిచేసుకుని, ఇంకా ధర్మంగా పరిపాలన సాగిస్తాను!'' అన్నాడు.

తరవాత కాశీరాజు తన నగరానికి తిరిగి వచ్చి, ధర్మం అణుమాత్రం కూడా తప్పకుండా ప్రజారంజకంగా రాజ్యపాలన చేస్తూ వచ్చాడు.





# రామాయణం

జాంబవంతుడు ప్రోత్సాహం ఇవ్వగా హనుమంతుడు రామముద్రికతో సహా లంకకు దాటి, రావణుడు సీతను ఉంచిన స్థలం కనిపెట్ట నిశ్చయించుకున్నాడు. అతను శరీరాన్ని పెంచి, మహేంద్రగిరి పైన అటూ ఇటూ తిరుగుతూ, పెద్ద వృక్షాలను తన రొమ్ముతో కూలదోస్తూ, మృగాలను చంపుతూ కొంత సేపు సంచరించాడు. బయలుదేరే ముందు అతను సూర్యుడికీ, ఇంద్రుడికీ, వాయుదేవుడికీ, బ్రహ్మకూ నమస్కారాలు చేసి, మహేంద్ర పర్వతం మీద చేతులూ, కాళ్ళూ ఆనించి ఒక్క ఊపు ఊపాడు. చలనం ఎరగని మహేంద్ర పర్వతం ఆ ఊపుకు కంపించిపోయింది. దాని మీది శిలలు బద్దలయ్యాయి. గుహలలో ఉండే ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. పర్వతం మీద ఉండే విద్యాధరులు కంగారు పడి ఆకాశంలోకి ఎగిరారు. ఋషులూ, చారణులూ, సిద్ధులూ హనుమంతుడు సముద్రాన్ని లంఘించి లంకకు వెళ్ళే యత్నంలో ఉండటం గురించి మాట్లాడుకోసాగారు.

హనుమంతుడు తన శరీరం మీది రోమాలను విదిల్చి, ఒక్క పెడబొబ్బ పెట్టాడు. ఒకసారి దూరం కేసీ, ఒకసారి ఆకాశం కేసీ చూసి, తన సమీపంలో ఉన్న జాంబవంతుడు మొదలైన వారితో, ''నేను రామబాణం లాగా వేగంతో లంకకు పోతాను, అక్కడ సీత కనిపించకపోతే అదే వేగంతో స్వర్గానికి వెళతాను. అక్కడ కూడా సీత లేని పక్షంలో తిరిగి లంకకు వెళ్ళి, ఆ రావణుణ్ణి బంధించి ఇక్కడికి తెస్తాను. అదృష్టం కలిసివస్తే సీతను తెస్తాను.

సుందరకాండ - 1



లేదా, రావణుడితో సహా లంకనే పెళ్ళగించి ఇక్కడికి తెస్తాను,'' అన్నాడు.

ఈ మాట చెప్పి హనుమంతుడు ఆకాశం లోకి ఎగిరాడు. హనుమంతుడు ఎగిరిన వేగానికి పెద్దపెద్ద మానులు అతని వెనకగా గాలిలో లేచి కొంతదూరం ఎగిరి, తరవాత సముద్రంలోపడిపోయాయి. దూరప్రయాణం మీద బయలుదేరే వాణ్ణి బంధువులు కొంత దూరం సాగనంపినట్టుగా ఆ చెట్లు హనుమం తుణ్ణి వెంబడించాయి. అవి పడిపోయిన తరవాత కూడా వాటి పూలు మరికొంత దూరం హనుమంతుడి వెంట వెళ్ళాయి.

దక్షిణ దిక్కుగా హనుమంతుడు అతి వేగంగా సముద్రం మీదుగా పోతూ ఉంటే, అతని చేతుల సందుగా వెళ్ళే గాలి గొప్ప రొద చేసింది. అతను లంకకు చేటు సూచించే తోకచుక్కలాగా లంక కేసి వెళ్ళాడు. అతని వేగానికి అతనికి దిగువగా ఉండే సము ద్రంలో పెద్ద తరంగాలు కల్లోలంగా లేచాయి. అతని నీడ సముద్రం మీద పది ఆమడల వెడల్పునా, ముప్ఫై ఆమడల పొడుగునా పడింది.

ఇలా సముద్రం మీదుగా వెళ్ళే హనుమం తుణ్ణి చూసి దేవతలు మెచ్చారు. సముద్రుడికి కూడా హనుమంతుడికి తోడ్పడాలనే ఆలోచన కలిగింది. ఎందుకంటే సముద్రుణ్ణి వృద్ధి పొందించిన సగరుడు ఇక్ష్వాకువంశం వాడు. అదే వంశంలో పుట్టిన రాముడి పని మీద హనుమంతుడు వెళుతున్నాడు. ఇక్ష్వాకు వంశానికి తన కృతజ్ఞత చూపుకోవాలంటే సముద్రుడికి ఇది మంచి అవకాశం.

అందుకని సముద్రుడు తనలో దాగి ఉన్న మైనాకపర్వతంతో, ''ఓ మైనాకుడా, పాతాళం లోని రాక్షసులు పైకి రాకుండా అడ్డం ఉన్న నీకిప్పుడు చిన్నపని చెబుతాను. వానర శ్రేష్ఠు డైన హనుమంతుడు రాముడి పని మీద అత్యంత సాహసంతో లంకకు ఎగురుతూ ఇటుగా వస్తున్నాడు. నీకు పైకీ, పక్కలకూ కూడా పెరిగే శక్తి ఉన్నది గనక, నీటి పైకి పెరిగి ఆ హనుమంతుడికి కాస్సేపు విశ్రాంతి ఇవ్వు. నీపైన కాస్సేపు విశ్రమించిన మీదట హను మంతుడు మిగిలిన దూరం మరింత తేలికగా వెళ్ళగలడు,'' అన్నాడు.

అప్పుడు బంగారు శిఖరాలు గల మైనాక పర్వతం సముద్రుడు కోరిన ప్రకారం ఆకాశం లోకి పెరిగింది. దాని బంగారు శిఖరాలు

నూరు సూర్యుళ్ళలాగా వెలిగాయి. ఆకస్మి కంగా తన దారికి అడ్డంగా పెరిగిన ఆ మైనా కాన్ని చూసి హనుమంతుడు, ''ఇది నా పనికి విఘ్నంచెయ్యాలనే దుర్బుద్ధితో నా దారికి అడ్డంగా లేచింది,'' అనుకుని ఆ పర్వతాన్ని తన రొమ్ముతో ఒక్క తోపు తోసేసరికి, అది పక్కకు పడిపోయింది.

తనను సునాయాసంగా పడదోసిన హను మంతుడి వేగానికి మైనాకుడెంతో సంతో షించి, మానవరూపం ధరించి ఒక శిఖరంపై నిలబడి, ''వానరవీరుడా, నువ్వు అసాధ్యమైన సముద్ర లంఘనం చేస్తూ కూడా, కొంచెమైనా అలియకపోగా, నన్ను పడదోశావు. నా శిఖరం మీద కాస్సేపు విశ్రమించు. ఒకప్పుడు రాముడి పూర్వీకుడైన సగరుడూ, అతడి కొడుకులూ సముద్రుడికి మహోపకారం చేశారు. అందుచేత రాముడి పని మీద వెళ్ళే నీకు కొంత సహాయం చేసి ఇక్ష్వాకులకు ప్రత్యుపకారం చెయ్యాలని సముద్రుడి కోరిక. అందుచేత నీకు విశ్రాంతి కలిగించ మని సముద్రుడు నన్ను కోరాడు. నా మీద నిలిచి, అలసట తీర్చుకుని కందమూల ఫలాలు ఆరగించి మరీ వెళ్ళు. ఏ అతిథి అయినా పూజనీయుడే అన్నప్పుడు, నీ వంటి అతిథి మాట వేరే చెప్పాలా? నువ్వు మహా పండితుడవు. అది అలాగుంచి, వాయు దేవుడికి ఋణపడి ఉన్నాను. ఎలాగంటే: కృత యుగంలో పర్వతాలన్నిటికీ రెక్కలుండేవి. అవి వేగంగా గాలిలో ఎగురుతూ ఉండేవి. అందుచేత వాటిని చూసి దేవతలూ,





మైనాకుణ్ణి తన చేతితో తాకి, సంతోషం తాండ వించే ముఖంతో ముందుకు సాగాడు.

''నీకు కార్యసిద్ధి అగుగాక!'' అని సము ద్రుడూ, మైనాకుడూ అతన్ని దీవించారు.

హనుమంతుడు అక్కడి నుంచి ఆకాశం లోకి మరింత ఎత్తుగా ఎగిరి ముందుకు సాగాడు. మైనాకుడిచ్చిన ఆశ్రయాన్ని నిరాక రించి దీక్షతో లంకకు వెళ్ళే హనుమంతుడికి దేవతలు పరీక్ష పెట్టగోరి, పాములకు తల్లి అయిన సురస వద్దకు వెళ్ళి, ''వాయుపుత్రు డైన హనుమంతుడు సముద్రం మీదుగా ఎగురుతూ లంకకు పోతున్నాడు. నువ్వు భయంకరాకారం ధరించి అతని దారికి అడ్డం తగులు. అతను నిన్ను జయించి పోతాడో, నిన్ను చూసి భయపడతాడో చూడగోరు తున్నాం. అతని పరాక్రమం ఎంతటిదో తెలుసు కోవాలని మా అందరి కోరిక,'' అన్నారు.

సురస వారి కోరిక తీర్చటానికై కొండంత రాక్షసరూపం ధరించి, పెద్ద కోరలతోనూ, గోరోజనం రంగుగల కళ్ళతోనూ భయం కరంగా తయారై, హనుమంతుడి దారికడ్డంగా నిలబడి, ''హనుమంతుడా, నిన్ను భక్షించ టానికి దేవతలు నాకు అనుజ్ఞ ఇచ్చారు. కనక నువ్వు నా నోట్లోకి ప్రవేశించు,'' అన్నది.

హనుమంతుడు సురసకు నమస్కారం చేసి, నవ్వుతూ, ''రాముడు వనవాసం చేస్తూండే సమయంలో, ఆయన లేనప్పుడు రావణుడు ఆయన భార్య అయిన సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా ఇప్పుడు సీత వద్దకు పోతున్నాను. రాముడి

ఋషులూ కూడా భయపడ్డారు. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాల రెక్కలు అనేకవేల సంఖ్యలో తెగవేశాడు. నా రెక్కలు కూడా తెగవేయటానికి ఇంద్రుడు రాగా, నీ తండ్రి అయిన వాయుదేవుడు నన్ను అతివేగంగా తీసుకుపోయి ఇంద్రుడి బారి నుంచి కాపాడాడు. ఆయన దయవల్ల నా రెక్కలు దక్కాయి. అందు చేత నువ్వు కాదన కుండా నేనూ, సముద్రుడూ ఇచ్చే అతి థ్యాన్ని స్వీకరించాలి,'' అని చెప్పాడు.

దానికిహనుమంతుడు, ''చాలా సంతోషం! నీ మాటలే నాకు ఆతిథ్యం. మీ ఆతిథ్యాన్ని నిరాకరించినందుకు మీరు కోపగించ వద్దు. కార్యార్థినైన నేను విశ్రాంతి తీసుకోవటం అసాధ్యం. రామబాణంలాగా లంకకు పోతా నని వానరులకు మాట ఇచ్చాను,'' అంటూ

రాజ్యంలో ఉండే దానివే గనక నువ్వు కూడా రామకార్యానికి తోడ్పడాలి. కాదంటావా, రాముడి వద్దకు వెళ్ళి అనుమతి పొంది, నీ నోట ప్రవేశిస్తాను. ఇందుకు నాకేమీ అభ్యంతరం లేదు,'' అన్నాడు.

సురస ఆ మాటకు జవాబివ్వక, ''నన్ను దాటి ఎవరూ వెళ్ళలేరు. ఆ విధంగా నాకు వరం ఉన్నది. నా నోటి ముందుకు వచ్చిన వాడు తప్పించుకు పోలేకుండా నాకు బ్రహ్మ వరమిచ్చాడు. కనక నా నోట ప్రవేశించు,'' అంటూ నోరు తెరిచి హనుమంతుడి ముందు నిలబడింది.

ఈ మాటకు హనుమంతుడు అలిగి, ''అయితే, నన్ను మింగేటంతగా నోరు తెరు!'' అంటూ, తన శరీరాన్ని పది ఆమడల ప్రమాణానికి పెంచాడు. వెంటనే సురస తన నోటిని ఇరవై ఆమడల ప్రమాణానికి పెంచింది. హనుమంతుడు కోపంతో తన దేహాన్ని ముప్పై ఆమడలకు పెంచాడు. సురస తన నోటిని నలభై ఆమడలు చేసింది. హనుమంతుడు తన శరీరాన్ని యాభై ఆమడలకు పెంచాడు.

ఈ విధంగా పోటీ పడటంతో హనుమంతుడి శరీరం తొంభై ఆమడలు, సురస నోరు నూరామడలూ అయ్యాయి.

అకస్మాత్తుగా హనుమంతుడు తన శరీరాన్ని వేలంతదిగా చేసి, తూనీగలాగా సురస నోట్లో ప్రవేశించి మళ్ళీ బయటికి వచ్చి, ''ఓ సురసా, బ్రహ్మదేవుడు నీ కిచ్చిన వరం సార్థకమయింది. నీ నోటి ముందుకు వచ్చిన నేను



నీ నోట ప్రవేశించాను. ఇంతటితో నన్ను వదిలిపెట్టు. సీత ఉండే చోటికి వెళ్ళాలి,'' అన్నాడు.

సురస రాక్షస రూపం విడిచిపెట్టి మామూలు రూపు ధరించి, ''వెళ్ళిరా, నాయనా. నీకు విజయం కలుగుతుంది. రాముణ్ణీ, సీతనూ తిరిగి కలుపు!'' అని చెప్పి తన నివాసానికి వెళ్ళింది.

హనుమంతుడు తిరిగి ప్రయాణం సాగించాడు. ఆకాశంలో ఎగిరిపోయే హనుమంతుణ్ణి సింహిక అనే రాక్షస జంతువు సముద్రంలో ఉండి చూసింది. అది ఆకలితో ఉండటం చేత హనుమంతుణ్ణి తినగోరి, అతని నీడను పట్టుకుని ఈడ్చింది. తనను ఎవరో వెనక్కు లాగేస్తూండటం గమనించి హనుమంతుడాశ్చర్యపోయి, అటూ, ఇటూ, అన్ని పక్కలా చూసేసరికి సముద్రం మీద

సింహిక కనిపించింది. అది తన నీడను పట్టుకుని ఉండటం చూడగానే హనుమంతుడికి సుగ్రీవుడు ఎప్పుడో అన్న మాట జ్ఞాపకం వచ్చింది. దక్షిణ సముద్రంలో ఒక వింత జంతువు వున్నదనీ, అది నీడను పట్టుకో గలదనీ సుగ్రీవుడన్నాడు. అదే ఇది అయి ఉంటుందని హనుమంతుడనుకున్నాడు.

సింహిక శక్తి ముందు హనుమంతుడి పరాక్రమం ఎందుకూ పనికి రాలేదు. అది అతణ్ణి తన కేసి ఈడ్చుకున్నది. హనుమంతుడు తన శరీరాన్ని అపారంగా పెంచాడు. అందుకు తగ్గట్టుగానే సింహిక కూడా భయంకరంగా నోరు తెరిచింది. ఆ తెరిచిన నోటి కుండా హనుమంతుడు దాని శరీరంలోని మర్మస్థానాలు గమనించి, తన శరీరాన్ని చిన్నదిగా చేసి, లోపలికి ప్రవేశించి, సింహిక మర్మాలు చీల్చేసి, అది తిరిగి నోరు మూసే లోపుగా బయటికి వచ్చేసి, తన శరీరాన్ని పెద్దది చేసుకున్నాడు. సింహిక గుండెలు చీలిపోయి స్పృహ తప్పి చచ్చి, నీటిపై తేలింది. చచ్చిన సింహికనూ, చంపిన హనుమంతుణ్ణీ చూసి ఆకాశంలో సంచరించే భూతాలు ఎంతో సంతోషించి, హనుమంతుణ్ణి కీర్తించాయి.

హనుమంతుడు మళ్ళీ బయలుదేరాడు. కొంత సేపటికి అతనికి సముద్రపు అవతలి తీరం కనిపించింది. అక్కడ అడవులున్నాయి. పోయినకొద్దీ లంకాద్వీపమూ, అక్కడి వనాలూ, చెట్లూ మరింత బాగా కనిపించాయి. లంకలోని నదులు సముద్రంలో వచ్చి పడటం కనిపించింది.

తన దేహం ఇంకా పెద్దదిగానే ఉండటం హనుమంతుడికి జ్ఞాపకం వచ్చింది. లంకలోని రాక్షసులు అంత శరీరంతో ఉన్న తనను చూశారంటే హాహాకారాలు చేసి, అందరికీ చెబుతారు; అప్పుడు తాను వచ్చిన పని కాస్తా పాడైపోతుంది. అందుచేత హనుమంతుడు తన దేహాన్ని చిన్నదిగా చేసుకున్నాడు.

ఆ శరీరంతో అతను ఆలంబపర్వతం మీద దిగాడు. దాని మీద విరిగిచెట్లూ, మొగలి పొదలూ, కొబ్బరిచెట్లూ ఉన్నాయి. ఎత్తుగా త్రికూటపర్వతం పైన లంకానగరం కనిపిస్తున్నది. అది దేవేంద్రుడి అమరావతీ నగరం లాగున్నది.





# పుకారు

ఏదైనా ముఖ్య విశేషముంటే, దాన్ని అందరి కన్న ముందుగా తాను తెలుసుకుని, అంద రికీ చెప్పాలని సూరప్ప ఆరాటం. ఆ తొంద రలో వాడు చాలాసార్లు తప్పుడు వార్తలు ప్రచారం చెయ్యడంవల్ల వాడి మాటలు ఎవరూ నమ్మేవారు కారు. ఇది సూరప్పకు చాలా బాధ కలిగించింది. కాని వాడు తన మీద లోకులకు గల అభిప్రాయం మార్చడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

ఒక రోజు ఊళ్ళో ఏదో గొడవ జరిగింది. అలాటి గొడవలను పరిష్కరించడంలో పొరు గూరి కరణంగారికి మంచి పేరున్నది. అందు కని ఊళ్ళోవాళ్ళు ఆయనకు కబురు చేస్తే, మర్నాడు ఉదయం వస్తానని ఆయన చెప్పి పంపాడు.

గొడవ పడిన ఇరుపక్షాలవాళ్ళూ మర్నాడు ఉదయం పొరుగూరి కరణంగారి కోసం ఒక చోట చేరి, చాలా సేపు ఎదురు చూశారు. ఎందువల్లనో ఆయన ఎంతకూ రాలేదు. చివరకు రెండు పక్షాల వాళ్ళూ తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

పొరుగూరి కరణం అన్నమాట తప్పే మనిషి కాడు. ఆయన రాకపోవడానికి తప్ప కుండా ఏదో పెద్ద కారణమే ఉంటుంది. అదే మిటో అందరికన్న తనే ముందుగా తెలుసు కుని, అందరికీ చెప్పాలని సూరప్ప ఆరాట పడి, మండుటెండనూ, భోజనం వేళనూ కూడా లక్ష్యపెట్టకుండా పొరుగూరు బయలు దేరాడు.

ఊరి వెలుపలనే సూరప్పకు ఒక శవం ఎదురయింది.

దారిలో కనిపించిన ఒక మనిషితో వాడు, ఎవరిదా శవం? మామూలు మనిషిదిలాగా లేదే?'' అన్నాడు.

25-ఏళ్ళనాటి చందమామ కథ



''ఈ ఊళ్ళో ఉండే ఒక్క గొప్పవాడిది,'' అన్నాడా మనిషి.

''ఈ ఉళ్ళో గొప్పవాడెవరు?'' అని సూరప్ప ఆ మనిషిని మళ్ళీ అడిగాడు.

''మా కరణంగారి కన్న ఈ ఊళ్ళో గొప్ప వాడెవరున్నారు?'' అని ఆ మనిషి జవాబు చెప్పాడు.

సూరప్పకు అంతా అర్థమైపోయింది. పాపం, ఆ ఊరి కరణంగారు పోయాడు. అందుకే ఆయన ఈ ఉదయం తగువుతీర్చ టానికి తమ ఊరికి రావడం జరగలేదు!

ఈ అపూర్వ వార్త తమ ఊళ్ళో అందరికీ అందించడానికి సూరప్ప పరిగెత్తుకుంటూ వచ్చి, కనిపించిన ప్రతి మనిషికీ, ''పాపం, ఈ ఉదయం పొరుగూరి కరణంగారు పోయారు! అందుకే ఆయన ఈ ఉదయం రాలేదు. శవాన్ని నేను కళ్ళారా చూశాను!'' అని చెప్పనారంభించాడు.

ఒక్కడు కూడా వాడు తెచ్చిన అద్భుత వార్తను నమ్మలేదు. సూరప్పకు చాలా బాధ కలిగింది. నిజం చెప్పినా తన మాట ఎవరూ నమ్మరెందుకు? తాను నిజం చెబుతాడని అందరికీ నమ్మకం కలిగేలా చెయ్యడం ఎలా? ''అయ్యా, కరణంగారు పోయినం దుకు మన ఊరి పెద్దలు కొందరు వెళ్ళి పరామర్శించి రావడం అవసరం కూడా గనక, వెంటనే బయలుదేరండి. నిజం మీకే తెలుస్తుంది!'' అన్నాడు సూరప్ప.

అలా అన్నప్పటికీ వాడి మాటలు ఎవరూ పట్టించుకోలేదు.

''ఆ ఊరి కరణంగారి శవాన్ని చూశానం టున్నావు గదా, ఆ కరణంగారు అసలు ఎలా

ఉంటారో నువ్వెప్పుడైనా చూశావురా?'' అని కొందరు సూరప్పను అడిగారు.

''అంత గొప్పవాడు పోతే ఆ వార్త తెలియ డానికి శవాన్ని గుర్తించాలా?'' అన్నాడు సూరప్ప.

తనతోబాటు, చచ్చిపోయిన పొరుగూరి కరణంగారికి కూడా తన గ్రామస్థులు తీరని అన్యాయం చేస్తున్నారు! అందుచేత, ఆ పొరుగూరికి చెందినవాణ్ణి ఒకణ్ణి పిలుచుకు వచ్చి చెప్పిస్తే, తనపైన తన గ్రామంవాళ్ళకున్న దురభిప్రాయం పోతుంది.

ఇలా అనుకుని సూరప్ప మరోసారి పొరుగూరికి బయలుదేరాడు. దారిలో వాడికి ఒక పెద్దమనిషి ఎదురయ్యాడు. ఆయన ఫలానా గ్రామం నుంచి వస్తున్నట్టు అడిగి తెలుసుకుని, ''ఈ ఉదయం మీ గ్రామ కరణంగారు చచ్చిపోయారని కనీసం మీరైనా నమ్ముతారుగా!'' అన్నాడు సూరప్ప.

''నమ్మను గాక నమ్మను!'' అన్నాడాయన.

''ఎందుకు నమ్మరు?'' అన్నాడు సూరప్ప ఆశ్చర్యంగా.

''నేనే ఆ గ్రామ కరణాన్ని గనక!'' అన్నాడా యన.

సూరప్ప నిశ్చేష్టుడయ్యాడు. వాడు ఎలాగో తేరుకుని, ఆ ఉదయం తనకూ, ఇంకో మని షికీ జరిగిన సంభాషణ గురించి చెప్పాడు.

''అకస్మాత్తుగా ఇవాళ ఉదయం మా ఊరి పెద్ద షావుకారు పోవడంవల్ల మీ ఊరు రాలేక పోయాను. మా ఊళ్ళో నీకు తగ్గవాడు ఒకడు న్నాడు. వాడు అబద్ధం చెప్పకుండానే, వినేవా డికి అబద్ధం స్ఫురించేటట్టు చెప్పగలడు. చచ్చి పోయినవాడు గొప్పవాడన్నాడు. ఊళ్ళో నేను గొప్పవాణ్ణి అన్నాడు. ఈ రెండూ నువ్వు జోడించుకుని, నేనే చచ్చిపోయాననుకు న్నావు. నువ్వు వాడి సంగతి తెలియక నమ్మావు గాని, మా ఊళ్ళో వాడిమాట ఎవరూ నమ్మరు,'' అన్నాడు పొరుగూరి కరణంగారు.

సూరప్పకు జ్ఞానోదయం అయింది. అబద్ధం స్ఫురించేటట్టు నిజం చెప్పేవాణ్ణే ఎవరూ నమ్మరంటే, నిజం తెలుసుకోకుం డానే గ్రామంలో వార్తలు చెప్పే తనను ఎవరూ నమ్మకపోవటంలో ఆశ్చర్యం ఏమున్నదీ?






For five simple ways to beat the heat and win FABULOUS prizes, log on to www.chandamama.com

LOTTE Lacto King

## THREAD A STORY

Continue the story teasers in 100 words. Get your friends to rate your contributions and win great prizes.
Age limit: 5-9 years and 10-14 years
To thread your story, log on to www.chandamama.com





## DARE TO TELL

Have an adventure to share? Tell it in 5 pictures / illustrations and win fabulous prizes.
Age limit: 12-15 years
To tell your story, log on to www.chandamama.com

## MANGO TANGO

Join the big mango debate. Which is the best mango? The contenders are Alphonso, Dasheri, Langra and Banganapalli. Vote now!
Age limit: 10-16 years
To support your favourite mango, log on to www.chandamama.com





## WACKY VIDEO PARLOUR

Made a wacky video on your mobile phone or camera? Share your videos and win fabulous prizes.
Age limit: 10-16 years
To submit your video, log on to www.chandamama.com

Bubbaloo

## QUIZ OF THE DAY

Answer 5 questions and gain points. Put up your own quizzes and gain more points. The more points you get, the better the rewards.
Age limit: 5-8 years
To start winning, log on to www.chandamama.com




చిత్రాలు: గాంధి అయ్య
29
అజేయుడు గరుడుడు!
ఆదిత్యుడి భుజాల మీద వాలిన డేగ గుహాలయంలో ప్రవేశించి నాగబంధు చితాభస్మం వున్న పాత్రను ఎత్తుకుని పైకెగిరి అగ్నిగుండంలో పడవేసింది. మంటల నుంచి ఒక భయంకరాకారం వెలుపలికి వచ్చింది.


అగ్ని గుండం నుంచి బయట పడడానికి నరేంద్రదేవుడు ప్రయత్నించాడు. కాని వీలుకాక సాయంకోసం కేకలు పెట్టసాగాడు.


అతడి కేకలు భయంకరాకారాన్ని ఆకర్షించాయి.


నాగబంధు ప్రేతాత్మ అయిన ఆ భయంకరాకారం నరేంద్రదేవుణ్ణి రక్షించడానికి ప్రయత్నించింది.
అయితే, హఠాత్తుగా మళ్ళీ డేగ ప్రత్యక్షమై...


...భయంకరాకారం నరేంద్రదేవుణ్ణి కాపాడకుండా అడ్డుకున్నది.


నరేంద్రదేవుడు మరింత భయపడిపోయి కేకలు పెట్టసాగాడు.
కాపాడండి! ఎవరైనా వచ్చి కాపాడండి! అయ్యో! అయ్యో!


కోయయువకులు గుహాలయం నుంచి పారిపోయారు.
వెనక్కు తిరిగి చూడకండి! పరిగెత్తండి!
మన యజమానికి ఎలాంటి గతిపట్టింది!


నరేంద్రదేవుడి శరీరానికి నిప్పంటుకున్నది.


మంటలు భయంకరాకారాన్ని చుట్టుముట్టాయి.
ఆ... ఆ


భయంకరాకారం కాలి మసి అయిపోయింది.


భూతవైద్యుడు దిగ్భ్రాంతి చెందాడు.
ఏం చేయడానికీ తోచలేదు...


నా గతేమవుతుంది?


అతడు అక్కడి నుంచి పరిగెత్తబోయాడు. అంతలో డేగ...


...అతడిపై దాడి చేసి కళ్ళను చితక పొడిచింది.
ఆ...
అయ్యో...


డేగ తన బలమైన గోళ్ళతో భూతవైద్యుణ్ణి పట్టుకుని పైకెత్తి...


...కొండ చరియ వద్దకు లాక్కుపోయి లోతైన అగాధంలోకి పడవేసింది.


రవీంద్రదేవుడు అరుపులు విని వెనక్కు తిరిగిచూశాడు.
ఏం జరుగు తోందక్కడ?


ఆదిత్యుడు ఎక్కడ?


ఉన్నట్టుండి బాణాలు దూసుకురావ డంతో వాటి నుంచి తప్పించుకోవ డానికి రవీంద్రదేవుడు పరిగెత్తాడు.
బాణాలు? అవి ఎక్కడి నుంచి వస్తున్నాయి?


అతడు గుహలోకి వెళ్ళడానికి ప్రయత్నించాడు. అయితే...


అంతలో కోయవాళ్ళు చుట్టు ముట్టి పట్టుకున్నారు.
అయ్యా! మాతో రండి.
మానాన్న ఎక్కడ?


ఆయన అగ్నిగుండంలో పడి కాలి పోయాడు!
భూతవైద్యుడు?
ఆయన్ను డేగ ఎత్తుకు పోయింది!


రవీంద్రదేవుడు నేలపై కూలబడి చుట్టు పక్కలు చూస్తూ...
ఆదిత్యుడా?










ఒక కోయయువకుడు శిబిరం నుంచి వచ్చాడు.

అయ్యా! రాజావిక్రమ సింహుడు తన సైన్యాలను చేరుకోడానికి పథకం వేస్తున్నాడు.

అలాగా?












మన వారసత్వ స్థలాలు

# కోణార్క్

మన దేశంలో సూర్యభగవానుడికున్న అతి కొద్ది దేవాలయాలలో చాలా ముఖ్యమైనది కోణార్క్ సూర్యదేవాలయం. భువనేశ్వర్‌కు 65 కి.మీ. దూరంలో ఉన్న ఈ దేవాలయం రథాకృతిలో రెండు వైపులా 12 చక్రాలతో 7 గుర్రాలు లాగుతున్నట్టు నిర్మించబడి ఉన్నది.

ఈ దేవాలయం 261 మీ. పొడవు, 160 మీ. వెడల్పుతో తూర్పుకు అభిముఖంగా ఉన్నది. బ్రహ్మాండమైన, అద్భుతమైన ఆలయ నిర్మాణానికీ, శిల్పకళకూ ఈ దేవాలయం ప్రసిద్ధిగాంచింది. లోపల, బయట, గోడల మీద ఎటు తిరిగినా, మానవ మృగరూపాలలో అందమైన శిల్పాలు కనుల విందు చేస్తాయి. ఇదే ఈ దేవాలయ ప్రత్యేకత.

ఈ దేవాలయాన్ని 13వ శతాబ్దంలో తూర్పు గాంగ వంశానికి చెందిన మొదటి నరసింహదేవుడు (1238-64) నిర్మించాడు. నల్లరాతితో నిర్మించినందువల్ల దీనిని 'బ్లాక్ పగోడా' అంటారు. దాదాపు 1,200 మంది శిల్పులు 12 సం.లు శ్రమించి ఈ ఆలయాన్ని నిర్మించారు. ఆలయ నిర్మాణానికి అంచనాకు మించి వ్యయం కావడంతో త్వరగా పూర్తి చేయమని రాజు ప్రధాన శిల్పాచార్యుడు మహా బిసురాణాను ఆజ్ఞాపించాడు. గోపుర శిఖరశిలా నిర్మాణం తెలియక విచార పడుతున్నప్పుడు ప్రధాన శిల్పాచార్యుడి పన్నెండేళ్ళ కొడుకు బిసు ఇచ్చిన సలహా ఉపయోగపడిందని చెబుతారు.

యునెస్కో 1982 అక్టోబర్ 15వ తేదీ కోణార్క్ దేవాలయానికి దాని విలక్షణమైన కళాప్రాభనానికి గుర్తింపుగా ప్రపంచ వారసత్వ అంతస్థు కల్పించింది. విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ ఈ ఆలయాన్ని సందర్శించినప్పుడు, ''ఇక్కడి శిలాభాష మానవ భాషను అధిగమిస్తోంది!'' అని రాశాడు.



# వార్తలలో బాలలు

## శాంతి బహుమతి



2007సం. అంతర్జాతీయ బాలల శాంతి బహుమతి జాంబియాకు చెందిన థాండీవ్ చామా (16)కు ఇవ్వబడింది. ఆ దేశంలో ఆమె బాలల విద్యకు చేస్తున్న కృషికీ, పాఠశాలలలో మెరుగైన వసతుల కోసం చేస్తున్న ప్రచారానికీ గుర్తింపుగా ఈ బహుమతిని ఇచ్చారు. ఉపాధ్యాయుల కొరత కారణంగా ఆమె చదువుతున్న బడిని మూసి వేస్తున్నారని తెలిసినప్పుడు ఆమె ఈ ప్రచారాన్ని చేపట్టారు. అప్పుడా చిన్నారి వయసు ఎనిమిదేళ్ళే. బహుమతి విలువ 1,00,000 యూరోలు.

## ఉత్తమ నటుడు



చలన చిత్రాలకు బహుమతులు ఇచ్చేప్పుడు ప్రత్యేకంగా ఉత్తమ బాలనటులకు అవార్డులివ్వడం కొత్తేమీ కాదు. అయితే ఇప్పుడు 'తారే జమీన్ పార్' హిందీ చిత్రంలో నటించిన ఎనిమిదేళ్ళ దార్షెల్ సఫారీని ఉత్తమ నటుడి అవార్డుకు నామినేట్ చేయడం చలన చిత్ర చరిత్రలో అపూర్వ విషయం. ముంబైకి చెందిన ఒక సుప్రసిద్ధ సినిమా పత్రిక ఇస్తూన్న ఈ అవార్డులకు షారూఖాన్, అభిషేక్ బచ్చన్, అక్షయ్ కుమార్, షహీద్ కపూర్ మొదలైన వారు కూడా నామినేట్ చేయబడ్డారు. తారే జమీన్ పార్ చిత్రంలో మరో ముఖ్యమైన పాత్రలో నటించిన అమీర్‌ఖాన్ సహాయ నటుడి విభాగంలో నామినేట్ చేయబడ్డాడు.

చందమామ క్విజ్ - 3 (ఏప్రిల్ '08)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.

అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.

# VALOUR & ADVENTURE
# HUMOUR & MYSTERY
# MORALS & HEROES

Enthralling stories of six decades come together
in one incomparable collection




The Chandamama
60th Anniversary Collector's Edition
HARD COVER
Cover Price : Rs 449

Special price
for subscribers
Nett. Rs. 360

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఆగస్ట్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ,జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై తేనాంపేట, చెన్నయ్ -600 018

# బాల్యం నుంచి మేము పెరిగింది

# ఆంధ్రాబ్యాంక్ యొక్క కిడ్డి బ్యాంక్ తో

ప్రస్తుతం మా పిల్లలు కూడా అలాగే పెరగాలని కోరుకుంటున్నాము.



## ఎబి కిడ్డి బ్యాంక్

ప్రత్యేకించి పిల్లల కోసం, పిల్లల ప్రత్యేక పొదుపు పథకం "ఎబి కిడ్డి బ్యాంక్" ను ఆంధ్రాబ్యాంక్ వారు పునఃప్రవేశపెడుతున్నారు.
ఈ పథకం ప్రత్యేకమైన బొమ్మతో పాటు అనేక ప్రత్యేకతలను కలిగియున్నది.
నేడే మీ పిల్లల కోసం ఈ ఖాతాని ప్రారంభించి, చిన్న వయస్సులోనే వారిలో పొదుపు అలవాట్లను నేర్పించండి.

**ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक ANDHRA BANK**

(భారత ప్రభుత్వ సంస్థ)

Much more to do, with YOU in focus

CHANDAMAMA (Telugu) June 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08

# బబ్బా సాహసాలు

























